

चन्दामामा
चांदोबा
ಚಂದಮಾಮ
அம்புலிமாமா
చందమామ
CHANDAMAMA

TL·F1



- రుచిగలది
- పోదుపైనది
- చేయడం తేలిక




## The Rasna Spread Maker Cricket Bonanza

పిల్లల్లారా, త్వరపడండి! ఈ సదుపాయం 31వ డిసెంబరు, 1996 వరకూ.



5 కూపన్లతో** 25 కార్డుల సెట్.




10 కూపన్లతో** ఉత్సాహపూరితమైన క్రికెట్ గేమ్.

**CRICKET COUPON**

**SEND**
5 coupons for a set of 25 Cricketer Cards
10 coupons for an exciting Cricket Game

Send your coupons to P.O.Box No. 4225
Ahmedabad 380 009.
Offer valid till 31st December 1996.
Packs also available without this offer.

SPECIMEN

* రస్నా స్ప్రెడ్ మేకర్ ప్యాక్‌లనుంచి క్రికెటర్ కూపన్స్‌ని కత్తిరించి ఈ చిరునామాకు పోస్టుచెయ్యండి:
పి.ఓ. బాక్స్ నం. 4225,
అహమ్మదాబాదు-380 009.

Mudra:EAMR:9400 Tel




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'      సంచాలకుడు : నాగిరెడ్డి



## విద్యాలయాలు - రాజకీయపక్షాలు

కొంతకాలం క్రితం పాఠశాలలలో ప్రతి తరగతికీ ఒక విద్యార్థి నాయకుడూ, పాఠశాల విద్యార్థులందరికీ ఒక విద్యార్థి నాయకుడూ ఉండేవారు. తరగతి నాయకుణ్ణి ఆయాతరగతి ఉపాధ్యాయులూ; ప్రధానోపాధ్యాయుడూ – ఇతర ఉపాధ్యాయులూ కలిసి పాఠశాల విద్యార్థి నాయకుణ్ణీ నియమించేవారు. విద్యార్థుల చదువు, సత్ప్రవర్తన ప్రాతిపదికమీద ఆ నియామకం జరిగేది. ఆ తరవాత ఎటువంటి ఒడిదుడుకులూ లేకుండా విద్యాసంవత్సరం ప్రశాంతంగా గడిచి పోయేది.

ఆ కాలంలో విద్యార్థుల సంఖ్య పరిమితంగా ఉండేది. అందు వల్ల ఆ పద్ధతి సాధ్యమయింది. కాని, ఇవాళ విద్యార్థుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. పరిస్థితులు మారాయి. తమ నాయకు లను విద్యార్థులే ఎన్నుకునే పరిస్థితి ఏర్పడింది. అందువల్ల క్రమేణా రాజకీయపక్షాలు తమ పలుకుబడిని విద్యాలయాలకు విస్తరింప జేయడం ప్రారంభించాయి. అఖరికి రాజకీయపక్షాల ప్రాతిపదిక మీద విద్యార్థి నాయకుల ఎన్నికలు జరగడంవల్ల, పాఠశాలలలో, కళాశాలలలో, విశ్వవిద్యాలయాలలో ఉండవలసిన ప్రశాంత వాతా వరణం కలుషితమవుతున్నది!

పిల్లలను విద్యాలయాలకు పంపడం చదువుకోవడానికే గాని, రాజకీయాలు నడపడానికి కాదు. కాబట్టి, విద్యార్థుల మధ్య జరిగే ఎన్నికలలో రాజకీయపక్షాలు జోక్యంచేసుకోరాదనీ, అవి విద్యాసంస్థ లకు దూరంగా ఉండాలనీ – తల్లి దండ్రులు చాలామంది కోరుతు న్నారు. ఇది న్యాయమైన కోరికగానే కనిపిస్తున్నది!

సంపుటి : 99      అక్టోబర్'96      సంచిక : 4

విడిప్రతి : 6.00      సంవత్సర చందా : 72.00






Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

**CHANDAMAMA BOOKS ARE ALREADY A LEGEND! THEY OPEN A NEW HORIZON ON THE WORLD OF LITERATURE FOR THE YOUNG**

Added to the six titles by **Manoj Das** is the charming seventh–

**WHEN THE TREES WALKED**

by the inimitable story-teller **Ruskin Bond**




Rs. 30/-

Among the titles in the process of production are:

**STORY OF KRISHNA**
**STORY OF RAMA**
**STORY OF BUDDHA**



For details, write to:

**CHANDAMAMA BOOKS**
Chandamama Buildings
Vadapalani, Madras - 600 026.

## వార్తలు - విశేషాలు:

# ఇండియా - సిటిబిటి

సెప్టెంబర్ నెలారంభంలో, ఐక్యరాజ్య సమితిజనరల్ అసెంబ్లీ– సిటిబిటి పత్ర ఆమోదం పొందడానికి సభ్యదేశాల ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేసింది. గత జూన్ నెలలో జెనీవాలో అణ్వస్త్ర నిరాయుధీ కరణ కోసం ప్రత్యేక సమావేశం జరిగింది. చర్చలు జరిగాయి కాని, అక్కడ అది ఏకగ్రీవ ఆమోదం పొందలేక పోయింది. దాని పర్యవసానమే ఈ సిటిబిటి పత్రం. కాంప్రెహెన్సివ్ టెస్ట్ బ్యాన్‌ట్రీటీ (అణ్వాయుధ నిషేధ ఒప్పందం) సంక్షిప్త రూపమే సిటిబిటి.



ఈ పత్రాన్ని ఆమోదించాలని జనరల్ అసెంబ్లీలో, ఆస్ట్రేలియా ఒక ప్రేరణను ప్రవేశపెట్టింది. దానిని భారత దేశంతో పాటు కొన్ని దేశాలు మాత్రమే వ్యతిరేకించాయి. సెప్టెంబర్ 10వతేదీ సభ్య దేశాలు అత్యధిక మెజారిటీతో తీర్మానాన్ని ఆమోదించాయి. 185 సభ్యదేశాలలో 158 దేశాలు అనుకూలంగా ఓటు చేశాయి. ఇండియా, భూటాన్, లిబియా దేశాలు వ్యతిరేకించాయి. ఐదుదేశాలు సమావేశానికి హాజరు కాలేదు. మిగతా దేశాలు తటస్థంగా ఉండిపోయాయి. అయినా, ఈ తీర్మానాన్ని ఇండియా ఎందుకువ్యతి రేకిస్తున్నది? అభ్యంతరాలు ఏమిటి?

ప్రపంచంలోని ఐదు అగ్రదేశాలయిన –అమెరికా, ఇంగ్లాండు, రష్యా, చైనా, ఫ్రాన్స్‌లు ఇప్పటికే అణ్వాయుధాలను కలిగి ఉన్నాయి. 44 దేశాలు అణ్వాయుధాలు తయారు చేసే శక్తి సామర్థ్యాలు కలిగి ఉన్నాయి. అటువంటి దేశాలలో ఇండియా ఒకటి. అంతకు పూర్వం జరిగిన అణ్వస్త్ర నిరాయుధీకరణ సమావేశంలో ఐక్యరాజ్యసమితి అణ్వాయుధ నిషేధ ఒప్పందానికి మూడు లక్ష్యాలను ప్రకటించింది: ఒకటి – ఏ దేశమైనా సరే ఇకపై అణ్వాయుధాలు తయారుచేయడం ఆపివేయాలి. రెండు – ఇప్పటికే అణ్వాయుధాలు కలిగి ఉన్న దేశాలు, వాటినినిర్ణీత గడువు లోపల నిర్మూలించాలి. మూడు – అంతర్జాతీయ శాంతిని పరిరక్షించాలి. అంటే – ప్రపంచంలో అణ్వాయుధ యుద్ధాలు రాని పరిస్థితిని సృష్టించాలి.

పై మూడు లక్ష్యాలలో ఒక్కదాని సాఫల్యానికి కూడా ఈ ఒప్పందం దోహదం చేయదని ఇండియా భావిస్తున్నది. ఇతర దేశాలు అణ్వాయుధాలు తయారు చేయకూడదని ఆదేశించే ఐదు అగ్రదేశాలూ తమవద్ద ఉన్న ఆయుధాలను నిర్మూలించడానికి ఉత్సాహం కనబరచడం లేదు. మందగొడిగా ఉన్నాయి. తమ వద్ద కొంతవరకయినా అణ్వాయుధాలు ఉండాలని అవి ఆశిస్తున్నాయి. చైనా, ఫ్రాన్స్ దేశాలు నిన్న మొన్నటి వరకు అణ్వాయుధ పరీక్షలు జరుపుతూనే వచ్చాయి – అని ఇండియా తెలియజేసింది. ఆ విధంగా మొదటి లక్ష్యమే నెరవేరే స్థితి లేకుండా ఉన్నది. ఇక ఐదు దేశాలవద్ద ఉన్న అణ్వాయుధాలను నిర్మూలించడానికి ఒప్పంద పత్రం ఒక నిర్ణీతమైన గడువును నిర్దేశించలేదని ఇండియా సూచించింది. ఈ రెండు లక్ష్యాలు నెరవేరకుండా మూడవ లక్ష్యమైన అంతర్జాతీయ శాంతి అసాధ్యమని ఇండియా భావిస్తున్నది.

ఒప్పంద పత్రంలో సభ్య దేశాల సంతకాలకోసం జనరల్ అసెంబ్లీ మరొక మూడేళ్ళు వేచివుంటుంది. ఈ ఒప్పందంలో సంతకం చేయక పోయినప్పటికీ, అణ్వాయుధాలు తయారుచేసే ఉద్దేశం తనకు లేదని ఇండియా స్పష్టంచేసింది. తనకు అణ్వాయుధాలు తయారుచేసే శక్తిసామర్థ్యాలు ఉన్నప్పటికీ ఇండియా దానిని ఇంత వరకు శాంతియుత ప్రయోజనాలకు మాత్రమే ఉపయోగించుకోవడం ఇక్కడ గమనించవలసిన విషయం.

అణ్వాయుధ నిషేధ ఒప్పందంలో సంతకం చేయని ఇండియాపై, ఇతరదేశాలపై ఐక్యరాజ్య సమితి 1999వ సం॥లో ఎటువంటి చర్యతీసుకుంటుందో వేచి చూడాలి!



# రుద్రయ్య దణ్ణం

పులిందపురానికి కాళిందుడనే ఆయన గ్రామాధికారిగా వచ్చాడు. ఆయనకు అధికార దర్పం ఎక్కువ. ఆయన తన పనివాడు వీరయ్యతో, "బయటకు వెళ్ళినప్పుడల్లా నువ్వు నా పక్కనే వుండు. నేనెవరో తెలియని వారికి నాగురించి చెబుతూండు," అన్నాడు.

వీరయ్య ఆయనకు వినయంగా చేతులు జోడించి, "అయ్యా! నా బోటి సామాన్యుడినే ఊరంతా ఎరుగుదురు. తమరు గ్రామాధికారి. తమ గురించి అందరికీ ఈపాటికి తెలిసే వుంటుంది," అన్నాడు.

"లేదురా–ఇంకా తెలియనివాళ్ళు కొందరున్నారు. వాళ్ళకు నువ్వు నాగురించి చెప్పాలి," అన్నాడు కాళిందుడు. "కానీ, తమరెవరయిందీ, తెలియని వాళ్ళెవరో, నాకెలా తెలుస్తుందయ్యా?" అన్నాడు వీరయ్య.

"నేనూళ్ళో తిరుగుతూంటే దణ్ణం పెట్టినవాడికి నేనెవరో తెలిసినట్టు. దణ్ణం పెట్టనివాడు నన్నెరగడని అర్థం," అన్నాడు కాళిందుడు.

దాంతో కాళిందుడి బుద్ధి వీరయ్యకు తెలిసిపోయింది. వాడాయనతో బయటకు వెళ్ళినప్పుడల్లా, ఈ విషయం జాగ్రత్తగా చూసుకునేవాడు. చాలామంది కాళిందుణ్ణి చూడగానే దణ్ణం పెట్టేవారు. దణ్ణం పెట్టని వారికి వీరయ్య, కాళిందుడు ఫలానా అని చెప్పగానే దణ్ణం పెట్టేవారు. ఎవరైనా అప్పుడూ మరిచిపోతే వీరయ్య గ్రామాధికారి వెనక నిలబడి,ఆ ఆసామీకి దణ్ణం పెట్టమని సైగ చేసేవాడు.

ఇలా బాగానే సాగింది కానీ, ఒక్క రుద్రయ్యతోనే ఇబ్బంది వచ్చింది. ఆయనకు ఆత్మగౌరవం ఎక్కువ. తలపొగరని కొందరంటారు. ఒకరోజు ఆయనకు కాళిందుడు, వీరయ్య ఎదురైనా దణ్ణం పెట్టకుండా ముందుకు సాగిపోయాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

"ఆయనెవర్రా? నన్ను చూడలేదా? నేనెవరో తెలియదా?" అన్నాడు కాళిందుడు కోపంగా.

రుద్రయ్య సంగతి తెలిసినా, అనవసరపు గొడవెందుకని, "ఇంకా తమరు తెలియకుండా వుంటుందా? బహుశా చూసి వుండరు," అన్నాడు వీరయ్య.

కాళిందుడికీ మాటలు అంత తృప్తిగా అనిపించలేదు. ఆయన వీరయ్యతో, "పద, ఆ విషయం తేల్చుకుందాం. ఆయనచేత దణ్ణం పెట్టించుకున్నాకే, ఈ రోజు కిల్లుచేరేది," అంటూ వెనక్కు తిరిగాడు.

ఇద్దరూ రుద్రయ్య ననుసరించి కొంత దూరం వెళ్ళారు. రుద్రయ్య ఒక దుకాణం దగ్గర ఆగి అరటిపళ్ళు బేరం చేస్తున్నాడు.

వీరయ్య, కాళిందుడు అక్కడకు చేరి, తామూ దుకాణం వద్ద ఆగారు. రుద్రయ్య వాళ్ళిద్దర్నీ ఎగాదిగా ఒకసారి చూసి, తన పనిలో మునిగిపోయాడు.

కాళిందుడు, వీరయ్య చెవిలో, "నన్ను చూశాడురా,ఇంకా దణ్ణం పెట్టలేదు," అంటూ గొణిగాడు.

"బహుశా తమరు తెలియదేమో లెండి, వీలు చూసుకుని పరిచయం చేస్తాను," అన్నాడు వీరయ్య నెమ్మదిగా,అప్పటికి తప్పించుకుందామని.

"ఎదురుగా మనిషిని పెట్టుకుని ఎప్పుడో అంటావేమిట్రా–ఇప్పుడే పరిచయం చెయ్యి," అని కాళిందుడు వీరయ్యను హెచ్చరించాడు.

వీరయ్య రుద్రయ్యను పలకరించి కాళిందుడెవరో చెప్పాడు.



"అలాగా! కొత్త గ్రామాధికారి వచ్చాడని విన్నాను, ఈయనే నన్నమాట! చూడ్డానికి బాగున్నాడు," అని, "అయ్యా! విగ్రహపుష్టి, నైవేద్య నష్టి అని రూపు బాగుంటే మాత్రం చాలదు. పాత గ్రామాధికారి ఆరోగ్యం బాగోలేక, మా పుళిందపురం విడిచిపెట్టి వెళ్ళాడు. కానీ, ఊరందరికీ ఆయనంటే ప్రాణం. తమరూ ఆయనంత మంచిపేరు తెచ్చుకోవాలి," అంటూ కాళిందుడికి సలహా ఇచ్చాడు రుద్రయ్య.

దణ్ణం పెట్టలేదు సరికదా సలహా కూడా ఇచ్చేసరికి, కాళిందుడికి మరింత ఒళ్ళు మండింది. ఆయన వీరయ్యను హెచ్చరిస్తూ వీపుమీద గోకాడు. వెంటనే వీరయ్య, "అయ్యా! గ్రామాధికారిని మొదటిసారిగా చూస్తున్నారు. దణ్ణం పెట్టరా?" అన్నాడు రుద్రయ్యతో.



"ఏమిటోరా– సమయానికి స్ఫురించ లేదు. ఆయనకు నా దణ్ణంయోగం లేద నుకో – అంతే!" అన్నాడు రుద్రయ్య.

"స్ఫురించకపోతే ఇప్పుడు గుర్తు చేశాను కదా!" అన్నాడు వీరయ్య.

రుద్రయ్య కోపంగా, "ఆయన్ను చూసి గౌరవం పుట్టి దణ్ణం పెట్టాలిగానీ,నువ్వు చెప్పా వని పెట్టను. ఇప్పుడు నీ మాట విని దణ్ణం పెట్టాననుకో, అప్పుడు నీ మాటను గౌరవించి నట్టవుతుంది. ఆయన్ను కాదు," అన్నాడు.

"అయితే ఏమంటారు? ఆయనే దణ్ణం పెట్టమని అడగాలా మిమ్మల్ని?" అన్నాడు వీరయ్య, కాళిందుడు వెనక నుంచి గోకు తూంటే భరించలేక.

"ఇదిగో, ఒరేయ్! చెబుతున్నా విను. అడిగి దణ్ణం పెట్టించుకునేవాణ్ణి అడుక్కునే వాడు కూడా గౌరవించడు. ఆ ఇంగితం నీకు లేదేమో కానీ, ఆయనకుందనే నా నమ్మకం," అన్నాడు రుద్రయ్య.

కాళిందుడికి చచ్చేంత అవమానమైనా ఏమీ అనలేక ఊరుకున్నాడు. ఇంటికి తిరిగి వెళ్ళాక ఆయన, రుద్రయ్య మీద కారాలూ మిరియాలూ నూరితే, వీరయ్య కలుగజేసుకుని, "ఎందుకొచ్చిందయ్యా! ఒక్క మనిషిగురించి పట్టించుకోకండి. ఆ రుద్రయ్య తనకంటే పెద్దవారికీ, దేవుడికీ తప్ప ఇంకె వరికీ దణ్ణం పెట్టడు. ఆయన జోలికి వెళితే పరువు పోవడం తప్ప లాభముండదు," అంటూ సర్దిచెప్పబోయాడు.

"నేను గ్రామాధికారిని.నాకు దణ్ణం పెట్టని వాళ్ళు నష్టపోవాల్సిందే!" అంటూ కాళిందుడు చిందులుతొక్కాడు.

అయితే, గ్రామాధికారి, రుద్రయ్య గురించి వాకబు చేస్తే– ఆయన చాలా మంచివాడనీ, అందరికీ సాయం చేస్తూంటాడనీ, నీతీ నిజాయితీలకు ప్రాణం పెడతాడనీ, తప్పు చెయ్యడనీ తెలిసింది. రుద్రయ్యను వెంటనే ఎలా భయపెట్టాలో తెలియక కాళిందుడొక ఉపాయం ఆలోచించాడు.

ఆ ప్రకారం సునందుడనే పేదరైతు, రుద్రయ్యను కలుసుకుని, "అయ్యా! కాళిం దుడికి నేను కనబడినప్పుడల్లా దణ్ణం పెట్టే వాణ్ణి. ఈ ఒక్కరోజూ ఏదో ఆలోచనలోవుండి దణ్ణం పెట్టలేదు. అంతే! ఆయనకు వల్ల మాలిన కోపం వచ్చింది. నా పొలం పన్ను వాయిదాలమీద కట్టడానికి ఒప్పుకున్న వాడు, ఈ రోజు మొత్తం పన్నంతా ఒక్కసారిగా కట్ట మంటున్నాడు," అని చెప్పాడు.

"అసలు, సాటి మనిషికి రోజూ ఎందుకు దణ్ణం పెట్టాలి? అలా అలవాటు చేసి, ఇప్పు డేడ్చి ఏం లాభం? నీ పన్ను డబ్బు నేను కడ తాను. ఇక మీదట కాళిందుడికి కనబడినా దణ్ణం పెట్టకు," అన్నాడు రుద్రయ్య.

"అధికారికి దణ్ణం పెడితే తప్పేముంది, బాబయ్యా!" అన్నాడు సునందుడు.

"రోజూ దణ్ణం పెట్టేవాడు, ఒక్కరోజు దణ్ణం పెట్టడం మర్చిపోతే అది తప్పవు తుంది. రోజూ దణ్ణం పెట్టనివాడు ఒకరోజు దణ్ణం పెడితే ఎంతో సంతోష మవుతుంది. అధికారికి అవసరమున్నప్పుడే దణ్ణం పెట్టాలి. మిగతా దణ్ణాలన్నీ ప్రయోజనం లేకుండా పోతున్నప్పుడు, ప్రయోజనము న్నప్పుడే దణ్ణం పెట్టడం నేర్చుకోవాలి. అర్థ మయిందా?" అన్నాడు రుద్రయ్య.

సునందుడీవార్త కాళిందుడికి చెప్పేలోగా, ఇంకా చాలామందికి రుద్రయ్య ద్వారా తెలిసి పోయింది. దాంతో ఆ రోజునుంచీ ఊళ్ళో చాలామంది కాళిందుడికి దణ్ణం పెట్టడం మానుకున్నారు.

రోజూ దణ్ణం పెట్టేవాడు, ఒక్కరోజు పెట్టకపోతేనే కోపగించుకుంటానని తెలిస్తే, రుద్రయ్య బెదిరిపోతాడని కాళిందుడను కుంటే- ఆ ఉపాయమింకోలా బెడిసికొట్టింది. రుద్రయ్య మూలంగా తనకు ఊళ్ళో గౌరవం లేకుండా పోతున్నదని, కాళిందుడికి బెంగ పట్టుకున్నది.

ఇలా వుండగా- ఒకరోజున రుద్రయ్య మనమణ్ణి పాము కరిచింది. వాడు పెద్ద కేక వేసి పడిపోయాడు. రుద్రయ్య కొడుకు వైద్యుడి కోసం పరిగెత్తాడు. ఈ సంగతి తెలిసిన కాళిందుడు, "నాకు పాము మంత్రం వచ్చు! ఆ రుద్రయ్య వచ్చి నాకు దణ్ణం పెడితే, మంత్రం వేసి ఆయన మనమణ్ణి బతికిస్తాను," అన్నాడు.



ఇది విన్నా, రుద్రయ్య కాళిందుడింటికి వెళ్ళలేదు.వైద్యుడి మందు పనిచేసి, ఆయన మనమడు బతికి బట్టకట్టాడు. అయితే అందరూ రుద్రయ్య మొండితనానికి చిరాకు పడ్డారు.

కొద్దిరోజులు గడిచాక, రుద్రయ్య పాలేరును పాము కరిచింది.వాడు వెంటనే,"బాబూ! నేను అబ్బాయిగారిని కరిచిన పామును చంపానని, దాని జతపాము పగబట్టి నన్ను కాటు వేసింది. మంత్రం వేస్తే నేను బతుకుతాను. లేకుంటే లేదు. తమరి పాలేరును కాబట్టి కాళిందుడు నాకుమంత్రం వేయడు. నాకు కాలం మూడింది!" అంటూ ఏడ్వసాగాడు.

"కాళిందుడిని నేను తీసుకు వస్తాను. నువ్వేడవకు. ఈలోగా వైద్యం కూడా చేయించుకో," అని వాడికి నచ్చచెప్పి, గ్రామాధికారి ఇంటికి వెళ్ళాడు రుద్రయ్య.

అక్కడ కాళిందుడు, వీరయ్యతో ఊసులాడుతుంటే, రుద్రయ్య ఆయనకు రెండు చేతులూ జోడించి దణ్ణం పెట్టి, జరిగినదంతా చెప్పి, "తమరు వచ్చి మంత్రంవేసి నా పాలేరును బతికించాలి. కావాలంటే ప్రతిరోజూ వచ్చి ఇలా దణ్ణం పెడుతూనే ఉంటాను," అన్నాడు.

కాళిందుడు తెల్లబోయాడు. అంతలోనే కంగారు పడుతూ, "మీ చేత దణ్ణం పెట్టించుకోవాలని పట్టుదలకొద్దీ అలా అన్నానుకానీ, నాకు నిజంగా పాముమంత్రం తెలియదు," అన్నాడు.

రుద్రయ్య నవ్వి, "అసలు నేను పాము మంత్రాన్నే నమ్మను! ఇప్పుడు నా పాలేరును కరిచింది పగపట్టిన పాము కాదు. వాడికి విషం కూడా ఎక్కలేదు. మధ్య మధ్య ఏడ్వడం తప్ప, చక్కగా మాట్లాడుతున్నాడు. అయితే వాడు పాము మంత్రాన్ని నమ్ముతున్నాడు. తమరు మంత్రం వేయకపోతే, వాడి నమ్మకమే వాడి ప్రాణం తీస్తుంది. తమరు మంత్రం రాదని చెప్పకండి. వచ్చి మంత్రం వేయండి, చాలు," అన్నాడు.

కాళిందుడాయన చెప్పినట్లే చేశాడు. రుద్రయ్య పాలేరుకు ప్రమాదం తప్పింది. అయితే, చిత్రంగా ఆ రోజునుంచీ కాళిందుడు, రుద్రయ్య దణ్ణం పెట్టబోతే వారించడమే కాక, కనిపించినప్పుడల్లా తనే, ఆయనకు దణ్ణం పెట్టడం అలవాటు చేసుకున్నాడు.






# బాకీ వసూలు

వీరవరంలో ఉండే గొప్ప ధనవంతుడైన పరమానందం దగ్గర సుబ్బయ్య అనేవాడు అప్పు తీసుకుని ఎంతకూ తీర్చలేదు. సుబ్బయ్య వడ్డీతో సహా వెయ్యి వరహాలు పరమానందానికి ఇవ్వాలి. పరమానందం శతవిధాల ప్రయత్నించి సుబ్బయ్య దగ్గర బాకీ రాబట్టడంలో విఫలమయ్యాడు.

ఇలా ఉండగా, వీరవరానికి పొరుగున ఉన్న పోలవరం జమీ దివాణంలో, దివానుకు సహాయపడే ఒకముఖ్యమైన ఉద్యోగం ఖాళీ అయింది. పోలవరం దివాను పరమానందానికి చాలా స్నేహితుడు. అందువల్ల నమ్మకస్థుడైన యువకుణ్ణి, ఆ ఉద్యోగానికి పంపవలసిందిగా పరమానందాన్ని కోరాడు. ఆ సంగతి తెలిసి, వెంకటాద్రి, రామచంద్రం అనే ఇద్దరు యువకులు పరమానందం దగ్గరికి వచ్చారు.

పరమానందం ఆ యువకుల వివరాలు అడిగి తెలుసుకుని, వాళ్ళతో, "మీలో ఒకరిని మాత్రమే ఆ ఉద్యోగానికి సిఫారసు చేయగలను. ఆ ఉద్యోగం చాలా బాధ్యతాయుతమైనది. ముఖ్యంగా బాకీ వసూలు చేయడంలో నైపుణ్యం ఉండాలి. కాబట్టి ఒక పరీక్ష పెడతాను. ఆ పరీక్షలో నెగ్గినవారికే ఉద్యోగం. ఈ ఊళ్ళో సుబ్బయ్య నా వద్ద అప్పు తీసుకుని చాలాకాలంగా తీర్చడం లేదు. ఆ బాకీ వసూలుచేసుకునివచ్చినవారికి దివాణంలో ఉద్యోగం ఇప్పిస్తాను," అన్నాడు.

ఆయన చెప్పినదానికి ఇద్దరూ సమ్మతించారు. పరమానందం మూడురోజులు వ్యవధి ఇచ్చాడు.

మూడు రోజుల తరవాత ఇద్దరూ తిరిగి వచ్చి, పరమానందానికి నమస్కరించారు. పరమానందం సుబ్బయ్య బాకీవసూలు గురించి ఇద్దరినీ ప్రశ్నించాడు. వెంకటాద్రి తాను బాకీవసూలు చేయడంలో విఫలమైనట్టు చెప్పాడు.

రాంబాబు

"మరి నీ సంగతి ఏమిటి?" అని పరమానందం రామచంద్రాన్ని అడిగాడు.

రామచంద్రం, "ఈ రోజుతో సుబ్బయ్య మీకు కానీ బాకీ లేదు. పూర్తిగా వసూలు చేశాను," అంటూ పరమానందం చేతికి డబ్బు మూటను అందించాడు.

పరమానందం, ఆనందంగా రామచంద్రం భుజం తట్టి, "శభాష్, రేపే వెళ్ళి దివానును కలుసుకో. నీకా ఉద్యోగం తప్పక వస్తుంది!" అన్నాడు.

ఇద్దరు యువకులూ పరమానందం దగ్గర సెలవు తీసుకుని తమ గ్రామానికి బయలు దేరారు. దారిలో వెంకటాద్రి, "అవునూ, నేను ఎంతో ప్రయత్నించినా సుబ్బయ్య దగ్గర బాకీ వసూలు చేయలేకపోయాను. మరి నువ్వు అతన్ని ఎలా లొంగదీసుకున్నావు?" అని అడిగాడు రామచంద్రాన్ని ఆశ్చర్యంగా.

దానికి రామచంద్రం చిన్నగా నవ్వి, "అదా! నాకిప్పుడు ఉద్యోగం చాలా అవసరం. సుబ్బయ్య అప్పు తీసుకుంటాడే తప్ప, తీసుకున్న అప్పును తీర్చే రకం కాదు. అందువల్ల సుబ్బయ్యకు రెండువేల వరహాలు నేను అప్పుగా ఇస్తానన్నాను. అందులో వెయ్యి వరహాలు పరమానందానికి ఇవ్వవలసిన బాకీగా జమ చేస్తాను అని చెప్పాను. తనకు వెయ్యి వరహాలు అప్పుగా ముట్టుతుంది గనక, సుబ్బయ్య నేను చెప్పినదానికి సంతోషంగా ఒప్పుకున్నాడు. ఆ విధంగా సుబ్బయ్య నా నుంచి రెండువేల వరహాలు అప్పుగా పుచ్చుకున్నట్టు ఆయన చేత పత్రం రాయించి పుచ్చుకున్నాను. సుబ్బయ్య చేతిలో వెయ్యి వరహాలు పెట్టి, వెయ్యి వరహాలు పరమానందానికి సుబ్బయ్య బాకీగా జమ వేశాను!" అన్నాడు.

"మరి నీ రెండువేల వరహాలు ఎలా వసూలు చేస్తావు?" అని అడిగాడు వెంకటాద్రి.

"దానికీ ఒక మార్గం ఉంది. సుబ్బయ్యకు పోలవరం జమీందారుతో చాలా వ్యవహారాలున్నట్లు నాకు తెలుసు. దివాను దగ్గర ఉద్యోగ బాధ్యతలు చేపట్టాక, సుబ్బయ్య నాకు ఇవ్వవలసిన రెండువేలవరహాల బాకీని వసూలు చేయడం అంత కష్టం కాదు!" అన్నాడు రామచంద్రం.

వెంకటాద్రి, రామచంద్రాన్ని మెచ్చుకుంటూ, "నిజంగా ఈ ఉద్యోగానికి తగిన వ్యక్తివి నువ్వే!" అన్నాడు.






## 16

[ఇరవై ఏళ్లకు స్వదేశానికి తిరిగి వచ్చిన రూపధరుడు తన ఇంట్లో అడుగు పెట్టటానికి ఒక ముసలి బిచ్చగాడి రూపం ధరించవలిసి వచ్చింది. అతని రహస్యం అతని కుమారుడైన ధీరమతికి ఒక్కడికే తెలుసు. రూపధరుడి భార్య అయిన పద్మముఖిని పెళ్లాడే ఉద్దేశంతో అతని ఇంట చేరి అతని ఆస్తిని తిని తాగేస్తున్న దుర్మార్గులు, ఈ ముసలి బిచ్చగాణ్ణి ఎంతో అవమానించారు. కాని రూపధరుడు దానిని సహించి ప్రతీకారం కోసం వేచివున్నాడు. ఆ రాత్రి అందరూ వెళ్లిపోయి, గదిలో రూపధరుడూ, ధీరమతీ మాత్రమే మిగిలారు. – తరవాత]

**రూ**పధరుడు ధీరమతికేసి తిరిగి, "నాయనా, గోడలమీద ఉన్న ఆయుధాలన్నీ తీసిసామాన్ల గదిలో దాచెయ్యి. అవి ఏమయ్యాయనిఎవ రైనాఅడిగితే, దాచానని చెప్పు," అన్నాడు.

ధీరమతి తన తల్లివద్ద ఉన్న దాసీలలో పెద్దదయిన బహుకీర్తి అనే ఆమెను పిలిచి, "నానమ్మా, దాసీలందరినీ తమ గదులలోకి వెళ్లి తలుపులు వేసుకోమను. మా నాన్న వెళ్లిపోయాక ఈ ఆయుధాలకేసి చూసిన వారు లేరు. ఇవి చూడు ఎలా బూజుపట్టి పోయాయో! పెద్దవాణ్ణయ్యాను గనక, వాటిని కాపాడే బాధ్యత ఇక నాదేగా!" అన్నాడు ఉత్సాహంగా.

"నాతండ్రీ! ఇంటి పెత్తనమంతా నువ్వే తీసుకో, బాబూ!" అన్నది బహుకీర్తి. ఈ ముసలిది చిన్నతనంలో రూపధరుడికి దాది.

ఆమె వెళ్లిపోగానే రూపధరుడూ, ధీరమతీ లేచి గోడలకు తగిలించి ఉన్న డాళ్లూ,



వేశారు. ఈ పని ముగిసినాక రూపధరుణ్ణి అక్కడే వదిలేసి ధీరమతి తన పడకగదికి వెళ్లిపోయాడు.

కొద్దిసేపట్లో పద్మముఖి దిగివచ్చి విశాలమైన గదిలో ఒక ఆసనం పైన కూర్చుంది. దాసీలు చలి కుంపట్లలో కొత్తకట్టెలు వేసి మంటలుచేశారు. ఒక దాసీ రూపధరుణ్ణి చూసి, "ఇంకా ఇక్కడే ఉన్నావా, ముసలాడా? తిన్నదిచాలలేదా?" అనిఅవమానంగా మాట్లాడింది.

"బుద్ధితక్కువదానా, ఏమిటా ప్రేలాపన? నేనీయనతో మాట్లాడబోతున్నానని తెలిసి కూడా ఎందుకలా నోరు పారేసుకుంటున్నావు?" అని ఆ దాసీని మందలిస్తూ పద్మముఖి రూపధరుడికోసం తన ఎదురుగకుర్చీ వేయించింది. రూపధరుడు అందులో కూచున్నాక ఆమె, "అయ్యా, నువ్వెవరవు? మీది ఏ దేశం? మీ కులగోత్రాలేమిటి?" అని అడిగింది.

రూపధరుడు ఆమెకు తన గురించి ఏదో ఒక కట్టుకథ చెప్పి, తన దేశం సిసిలీ అనీ, యుద్ధానికి బయలుదేరి వెళ్ళేటప్పుడు రూపధరుడు తన ఇంటికి వచ్చి అతిథిగా ఉన్నాడనీ చెప్పాడు. ఆమెకు నమ్మకం కుదిరేలాగ అతను రూపధరుడు అప్పుడు ధరించి ఉన్న దుస్తులనూ, అతనిసేవకులనూ వివరించాడు. ఆ దుస్తులు పద్మముఖి తన భర్తకు ప్రయాణసమయంలో ఇచ్చినవే. ఆ వర్ణన వింటుంటే పద్మముఖికి బిచ్చగాడి మాటలో చాలా గురి కుదిరింది.

ఆమె బహుకీర్తిని పిలిచి, "ఈ అతిథి మీ యజమానికి స్నేహితుడు. ఈయనకు కాళ్ళు కడుగు," అన్నది. బహుకీర్తి ఒక పెద్దగిన్నెలో వేడినీళ్ళూ, చన్నీళ్ళూ సమపాళాలుగా కలిపి తీసుకువచ్చి అతిథికి కాళ్ళు కడగ నారంభించింది. రూపధరుడు తన బట్టను మోకాళ్ళపైకి తీశాడు. అతని కాలిపై ఉన్న మచ్చ బహుకీర్తికి కనిపించింది. ఆమె రూపధరుణ్ణి గుర్తించింది. ఆమె చేతిలో ఉన్న నీటిగిన్నె దభీమని కింద పడి నీరంతా ఒలికిపోయింది. ఆమె అరవటానికి నోరు తెరిచింది, కాని రూపధరుడు చప్పున ఆమె నోరుమూసి, "నానమ్మా,నా రహస్యం బయటపెట్టి నన్ను నాశనం చెయ్యకు. ఇరవైఏళ్లు అష్టకష్టాలూ పడి ఇంటికి చేరుకున్నాను. ఇంకా కొద్దికష్టాలు మిగిలి ఉన్నాయి. అవి గడిచినదాకా నా రహస్యం కాపాడు," అన్నాడు రహస్యంగా.

బహుకీర్తి ఇందుకు సమ్మతించి మళ్లీ నీరు తీసుకురాబోయింది.

ఆమె చూసి గుర్తించిన గాయం రూప ధరుడికి చిన్నతనంలో ఈ విధంగా కలిగింది. అతను కుర్రవాడై ఉండగా కట్న కానుక లిస్తామని అతని మేనమామలు పిలిపించారు. ఒకరోజు రూపధరుడు తన తాతగారితోనూ, మేనమామలతోనూ వేటకు వెళ్ళి అందరికన్న ముందుగా ఒక అడవిపందిని చూసి దాన్ని వేటాడి చంపేశాడు. అయితే అతని ఈటెదెబ్బ తగిలి చచ్చేలోపల ఆ పంది రూపధరుణ్ణి తన కొమ్ముతో కోరింది. ఆ గాయం మాని మచ్చపడింది.

బహుకీర్తి తన యజమానిని గుర్తించటం పద్మముఖికి తెలియదు. రూపధరుడు కాళ్ళు కడగటం పూర్తి అయి తిరిగి రాగానే ఆమె అతనితో, "అయ్యా, నాకొక గడ్డుసమస్య వచ్చిపడింది. ఇదివరకల్లా నా కొడుకు పసి వాడు, నా కొంగు పట్టుకుని వదలలేదు. అందుచేత నేను మళ్ళీ పెళ్ళాడి ఈ ఇంట్లో నుంచి వెళ్ళిపోవలిసిన అవసరంలేకపోయింది. ఇప్పుడు వాడు పెద్దవాడయ్యాడు. వాడికిప్పుడు నా కన్న కూడా వాడి ఆస్తి ముఖ్యం. నన్ను స్వయంవరం చేసుకోమని నిర్బంధించే ఈ రాజకుమారులు తన సొత్తంతా తినేస్తూ ఉండటం వాణ్ణి చాలా బాధిస్తున్నది. కనక నేను పెళ్ళిచేసుకు తీరాలి. ఇందుకు ఒక ఉపాయం ఆలోచించాను. నా భర్త పన్నెండు గొడ్డలితలలు బారుగా పెట్టి వాటన్నిటినుంచీ దూసుకుపోయేలాగా బాణం వేసేవాడు. నా భర్త బాణం ఎక్కుపెట్టి, పన్నెండు గొడ్డలి తలల కుండా బాణం వేసినవాణ్ణి పెళ్ళాడ దామని నాలోనేను నిశ్చయించుకున్నాను!" అన్నది.



తరవాత ఆమె తన గదికి వెళ్ళిపోయి పడుకున్నది. రూపధరుడు గది ముందు భాగంలో ఎద్దుచర్మంమీద గొర్రెతోళ్లు పరుచు కుని పడుకున్నాడు. అతనికి నిద్ర రాలేదు. తెల్లవార్లూ అతను ప్రతీకారం గురించి ఆలో చించి తెల్లవారగానే తన పక్క తోళ్ళు చుట్టి పెట్టి, దేవుణ్ణి ప్రార్థించాడు.

తెల్లవారగానే ఎవరి పనులమీద వారు బయలుదేరారు. పందుల కాపరి మూడు బలిసిన పందులు తోలుకువచ్చాడు. అతను రూపధరుణ్ణి చూసి, "ఇక్కడ చేరిన మూక నిన్ను సరిగా చూస్తున్నారా, బాబూ? లేక ఇంకా వారి బుద్ధి పోనివ్వటం లేదా?" అని అడిగాడు.

"వాళ్ళకు కాస్తయినా అభిమానం లేదు. ఇంకొకరి ఇంట చేరి ఇలా ప్రవర్తించే నీచు

లను దైవం తప్పక శిక్షస్తాడు!" అన్నాడు రూపధరుడు.

వారు మాట్లాడుతుండగా గొర్రెల కాపరి కాళుడు వచ్చాడు. తన కొత్త యజమానులు కోసుకు తినగలందులకు వాడు బలిసిన మేకలనూ, మేకపిల్లలనూ తెచ్చాడు. వాడు వాటిని బయట కట్టివేస్తూ రూపధరుణ్ణి చూసి, "ఇంకా ఇక్కడే ఉన్నావా, అడుక్కు తినేవాడా? అడుక్కోవటానికి ఇంత నగరంలో నీకు మరే ఇల్లూ కనబడలేదూ?" అన్నాడు పరిహాసంగా.

రూపధరుడు ఈమాటలకు జవాబుచెప్ప లేదు. అతని మనసులో కోపాగ్ని రగులుతున్నది.

ఇంతలో అక్కడికి సుఖప్రాప్తి అనే పశువుల కాపరి ఒక పాడి ఆవునూ, కొన్ని మేకలనూ వెంటబెట్టుకుని వచ్చాడు. వాడు రూపధరుణ్ణి చూసి ఎవరు, ఏ దేశస్థుడు అని పందుల కాపరిని అడిగాడు. ఏమంటే ఆ ముసలి బిచ్చగాడి అవతారం చూస్తూనే వాడికి తన యజమాని గుర్తుకొచ్చాడు, వాడి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. "అయ్యా, మా యజమాని కూడా నీ లాగే కుళ్ళుగుడ్డలు కట్టుకుని ఎక్కడన్నా దిక్కు లేకుండా తిరుగుతున్నాడేమో! ఆ మహారాజు ఎప్పటికైనా తిరిగి రాకుండా పోతాడా అన్న ఆశతో ఇంకా ఇక్కడ ఉన్నానే గాని, లేకపోతే ఈ తిండి పోతుల కొలువు ఒక్కనాటికి చేసే వాణ్ణా?" అన్నాడు వాడు రూపధరుడితో పట్టరాని బాధతో.

రూపధరుడు వాడితో, "నువ్వు బుద్ధి మంతుడిలాగా కనబడుతున్నావు. భయ పడకు. నువ్విక్కడ ఉండగానే మీ యజమాని తిరిగి వచ్చి, వీళ్ళందరినీ మట్టుబెడతాడు," అన్నాడు.

"సరిగా అంతపనే జరగాలిగాని నా చేతు లూరుకుంటాయా?" అన్నాడు సుఖప్రాప్తి.



సరిగా ఇదే సమయాన దుర్మార్గులు ధీరమతిని హత్య చేయడానికి ఒక పథకం ఆలోచిస్తున్నారు. మధ్యలో ఒకడు, "అన్న లారా, అపశకునాలు కనబడుతున్నాయి. ఈ పథకం పనిచెయ్యదు. ధీరమతి హత్య సంగతి తరవాత చూడవచ్చు. భోజనాలకు పోదాం పదండి!" అన్నాడు. అందరూ లేచి ముందుగదిలోకి వచ్చారు. కొందరు పశువులను కోసి నిప్పుమీద కాల్చసాగారు. రొట్టెలూ, పానీయాలూ వచ్చాయి. అందరూ తినటానికి ఉపక్రమించారు.

వాకిలికి పక్కగా ధీరమతి రూపధరుడికి ఒక పాత కుర్చీ, బల్లా వేయించాడు. అతను తన తండ్రి ముందు ఆహారమూ, పానీయమూ పెట్టించి, "సుఖంగా భోజనం చెయ్యి. నిన్ను ఎవరూ అవమానించకుండా చూస్తాను. ఇది నడివీధి కాదు. నా తండ్రి ఇల్లు. ఇప్పుడు నా ఆస్తి. అందరూ బుద్ధిగా మసలుకోమని మనవి చేస్తున్నాను. లేకపోతే నేనూరుకోను!" అని గట్టిగా అన్నాడు.

ఈ మాటలు విని అందరూ ఆశ్చర్య పోయారు. దుర్బుద్ధి తన మిత్రుల కేసిచూసి, "వాడి బెదిరింపు విన్నారా? ఇవాళ మంచి రోజు. మనకు అపశకునాలు జరగకపోయి నట్లయితే ఈ పాటికి వాడి నోరు మూయించే వాళ్ళం!" అన్నాడు.

ఈ మాటలు ధీరమతి విన్నాడు గాని, లక్ష్యపెట్టలేదు.

ఆ దుర్మార్గులలో అశ్వనిపుణుడు అని పొగరుబోతున్నాడు. వాడు చాలా స్థితిపరుడు. పద్మముఖి తన సంపద చూసి తనను పెళ్ళాడుతుందన్న ఆశతో వాడు దూరప్రాంతం నుంచి వచ్చాడు. వాడిప్పుడు తన అనుచరులతో, "అబ్బాయిలూ, ఒక్కమాట ఆలకించండి. ఈ ముసలి బిచ్చగాడు మనతో సమంగా కూచుని తింటూ, తాగుతున్నాడు





గదా. కాని వీణ్ణి ఇంకొక మెట్టు పైకి పంపిద్దాం. వీడికి నేనిచ్చే బహుమానం చూడండి," అంటూ ఒక ఆవుగిట్టలజోడు తీసి రూపధరుడి తలకేసి బలంగా విసిరాడు.

రూపధరుడు తలను పక్కకు తిప్పి దెబ్బను తప్పించుకున్నాడు.

ధీరమతి కోపంగానూ, వ్యంగ్యంగానూ మాట్లాడుతూ, "అశ్వనిపుణుడా, చాలా గురిగా గురి తప్పావు! కాని మన అతిథి తలను పక్కకు తిప్పుకోవడటం చూశాను. అతని తలకుదెబ్బేతగిలిఉంటే, నా బల్లెం నీగుండె లను గుచ్చి ఉండేది. నేనిదే చెబుతున్నాను, మీరు బుద్ధిగా మసలుకోండి. నేనుగ్రాహికం వచ్చినవాణ్ణి. మీరిలా విచ్చలవిడిగా నా పశువు లను కోసుకు తినడమూ, చెడతాగితందనాలు వేయటమూ నేను సహించను," అన్నాడు.

కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు. చివరకు ఒకడు, "మిత్రులారా, ఆ బిచ్చగాడి జోలికి పోకండి. ధీరమతీ, మేము కోరేదల్లా ఒకటే: మీ అమ్మ స్వయంవరం. ఆవిడ దేనికోసం ఎదురుచూస్తున్నది? మాలో ఒకరిని ఎందుకు పెళ్ళాడదు?" అన్నాడు.

వాకిలి కెదురుగా ఆసనం వేసుకుని కూచుని ఉన్న పద్మముఖి, ఈ సంభాషణ అంతా విన్నది. ఆమె లేచి వెళ్ళి తన భర్త తాలూకు వస్తువులుండే గది తలుపు తాళం తెరిచింది. ఆ గదిలో రూపధరుడి ధనుస్సూ, అంబులపొదీ ఉన్నాయి. ఈ ధనుస్సును రూపధరుడికి ఎవరో బహుమానంగాఇచ్చారు.. యుద్ధానికి బయలుదేరేటప్పుడు రూపధరుడు దానిని వెంట తీసుకుపోలేదు. పద్మముఖి ఆ ధనుస్సును కాస్సేపు తన ఒడిలో పెట్టుకుని ఏడ్చింది. తరవాత ఆమె కళ్ళు తుడుచుకుని ధనుస్సునూ, అంబులపొదినీ తీసుకుని కిందికి దిగి వచ్చింది. నౌకర్లు గొడ్డలి తలలను ఒక పళ్ళెంలో పేర్చి ఆమె వెనకనే తెచ్చారు.

పద్మముఖి విశాలమైనగది ద్వారంలో నిలబడి తన చెంపకు మేలిముసుగు అడ్డంగా పెట్టుకుని ఇలా అన్నది:

"అందరూ శ్రద్ధగా వినండి. మీరందరూ నన్ను పెళ్ళాడవచ్చి, మా ఇంటికి ముట్టడి వేసి, మా సొత్తంతా తింటున్నారు, తాగు తున్నారు. నన్ను పెళ్ళాడగోరడం తప్ప మీ అర్హత ఏమిటో మీలో ఒక్కరు కూడా బయట పెట్టలేకపోయారు. మీ అర్హత ప్రద ర్శించి నన్ను బహుమానంగా పొందండి. ఇదుగో నా భర్త ఉపయోగించిన ధనుస్సు. మీలో ఎవరు ఈ ధనుస్సుకు తాడు తగిలించి,

బాణం ఎక్కు పెట్టి ఈ పన్నెండు గొడ్డలి తలల గుండా బాణాన్ని వేస్తారో వారిని నేను పెళ్ళాడతాను."

ఈ మాట చెప్పి ఆమె పందులకాపరిని పిలిచి, అతని చేతికి ధనుస్సూ, గొడ్డలి తలలూ ఇచ్చి, వాటిని అందరికీ చూప మన్నది. వాటిని చేతిలోకి తీసుకుంటూ పందుల కాపరి కంటతడి పెట్టుకున్నాడు. దూరాన నిలబడి చూస్తున్న సుఖప్రాప్తికి కూడా దుఃఖం ఆగలేదు. దుర్బుద్ధి వారిద్దరినీ చూసి వెటకారంగా, "ఆడముండల్లాగా అలా ఏడుస్తారేం? తింటారా కూచుని తిండి తినండి. ఏడవదలిస్తే బయటికి పోయి ఏడవండి! మాకిక్కడ గట్టిపని పడింది. ఎందుకంటే ఈ విల్లు వంచడం అంత తేలిక పని అని నేననుకోను. రూపధరుడి వంటి బలశాలి ఇక్కడ ఎవరూ లేరు. నేను చిన్నతనంలో ఆయనను కళ్ళారా చూసిన వాణ్ణి! ఆయన బలం నాకు తెలుసు," అన్నాడు.

అతను పైకి అలా అన్నాడే గాని, తానా విల్లును వంచి, తాడు తగిలించి, బాణం గొడ్డలి తలలగుండా దూసుకుపోయేటట్టు గురిచూసి నేర్పుగా కొట్టగలనన్న ధైర్యం అతడికున్నది.

ధీరమతికి ఒక్కసారిగా వెర్రి ఆవేశం వచ్చినట్టయింది. "ఓహో, మా అమ్మ పెళ్ళాడి అత్తవారింటికి వెళ్ళే సమయం వచ్చింది! అది చూసి నేను వెర్రివాడికి మల్లే ఆనం దిస్తున్నాను. మా అమ్మలాటిది భూప్రపం చంలో ఎక్కడా లేదు. కాని ఆ మాట నేను అని ఏం లాభం? ఏదీ మా నాన్న ధనుస్సు నేను ఎక్కుపెట్టగలనేమో చూస్తాను!" అంటూ అతను లేచి గొడ్డలి తలలను అతి చాకచక్యంతో ఒక సోల్పులో అమర్చి తరవాత ధనుస్సును నిలువుగా నేలమీద నిలబెట్టి, దానికి తాడు తగిలించడానికి మూడు ప్రయత్నాలు చేశాడు. ఇంకా గట్టిగా ప్రయత్నిస్తే తాడు తగులుకుంటుందని అతనికి తోచింది గాని, రూపధరుడు ప్రయత్నించవద్దని అతనికి కళ్ళతో హెచ్చరిక చేశాడు. అతను విరమిస్తూ, "అబ్బే, నేను వట్టి అర్భకుణ్ణి. ఎందుకూ పనికిరాను. లేక నాకు ఆయం చాలదేమో! ఇక్కడ పెద్దలంతా ఉన్నారు గదా, మీ బల పరాక్రమాలు ప్రదర్శించండి. చూస్తాను!" అన్నాడు.

– (ఇంకా ఉంది)



# చందమామ కబుర్లు

## ఉత్తర ధ్రువంలో భారత పతాకం!

భారత వైమానిక దళానికి చెందిన స్క్వాడ్రన్ లీడర్ సంజయ్ థాపర్, ఏప్రిల్ 21వ తేదీ ఉత్తర ధ్రువాన్ని చేరుకున్నాడు. అంతకన్నా ముఖ్యమైన విశేషం ఏమంటే – అతడు 10,000 అడుగుల ఎత్తు నుంచి దూకి అంటే, 'స్కై–డైవింగ్' చేసి అక్కడికి చేరడం! అతడు హెలికాప్టర్ నుంచి కిందికి దూకగానే, దిగడానికి సరైన చోటును కనుగొనడానికి ఆకాశంలో రెండుసార్లు గిరిటీలు కొట్టాడు. ఆ తరవాత సెకనుకు 176 అడుగుల వేగంతో కిందికి దూసుకు వెళ్ళాడు. ఆఖరి 300 అడుగుల ఎత్తు నుంచి ప్యారాచూట్ సాయంతో కిందికి దిగాడు. మొత్తం మీద హెలికాప్టర్ నుంచి భూమి మీద కాలు మోపడానికి అతనికి ఆరు నిమిషాలు పట్టింది. మొట్టమొదటి పనిగా ఆర్కిటిక్ ధ్రువాగ్రంలో భారత పతాకాన్ని పాతాడు. అతడు హెలికాప్టర్ నుంచి దూకినప్పుడు భూమి మీద మైనస్ 26 డిగ్రీలు సెల్సియస్. అక్కడి ఉష్ణోగ్రత మైనస్ 68 డిగ్రీలు సెల్సియస్. భూమి మీద 26 డిగ్రీలు సెల్సియస్. మన దేశంలో ఎక్కువసార్లు స్కై డైవింగ్ చేసిన వాడు కూడా సంజయ్ థాపర్ కావడం విశేషం. రష్యా పారా రెస్క్యూ సెంటర్ ఏర్పాటు చేసిన సాహసయాత్రలో అతడు పాల్గొన్నాడు!

## అక్షరాస్యతను పెంచడానికి!

మధ్యప్రదేశ్ రాష్ట్రం మాండోర్ జిల్లాకు చెందిన ఇరవైరెండేళ్ళ రాంప్రకాష్ బాల్దే చదువుకున్నది పదవ తరగతి వరకే. పుట్టుక నుంచే కుడి కాలు లేకపోవడం వల్ల ఆపైన అతడు చదవలేకపోయాడు. అయితే, ఇప్పుడతడు ఒంటికాలుతోనే, మోటారు సైకిలు మీద యావత్ భారతయాత్ర చేశాడు. తన ప్రయాణం ద్వారా అక్షరాస్యత ప్రాముఖ్యతను చాటాలన్నది అతడి ఉద్దేశం. జూలైలో మధ్యప్రదేశ్ నుంచి బయలుదేరిన రాంప్రకాష్ 32 రాష్ట్రాలనూ, కేంద్రపాలిత ప్రాంతాలనూ పర్యటించి స్వతంత్ర దినమైన ఆగస్టు 15వ తేదీ రాజధాని ఢిల్లీకి చేరుకున్నాడు. రెండుచక్రాలవాహనం మీద అత్యంత దూరం ప్రయాణం చేసిన వికలాంగుడిగా తన పేరు గిన్నిస్‌బుక్ ఆఫ్ రికార్డ్సులో చోటు చేసుకోగలదని రాంప్రకాష్ ఆశిస్తున్నాడు. రోటరీ క్లబ్, లయన్స్ క్లబ్ వంటి అంతర్జాతీయ సంస్థలు అతని యాత్రను ప్రోత్సహించాయి!

## ఎమిలీ కథ!

అమెరికాకు చెందిన మాంస విక్రయశాల యజమాని ఒకాయన ఎమిలీ అనే ఒక ఐదేళ్ళ ఆవును తెచ్చి కొట్టంలో ఉంచాడు. చుట్టూ అయిదడుగుల కంచె ఉండడం వల్ల ఎమిలీ ఎక్కడికీ పోలేదులే అని అతడు భావించాడు. కాని ఒకనాడు ఎమిలీ కనిపించలేదు. అంత పెద్ద శరీరంతో ఐదడుగుల ఎత్తు కంచెను దాటి ఎమిలీ పారిపోవడం ఆశ్చర్యమే. ఆవు కోసం వెదకడం ప్రారంభించారు. ఆ విషయంగా పత్రికలలో ప్రకటనలు జారీచేశారు. మాసాచూసెట్స్, బోస్టన్ సమీప అడవిలో ఎమిలీ పట్టుపడింది. బోస్టన్ సమీపంలోని హోప్కింటన్‌కు చెందిన మేగ్‌రాండా, లూయిస్ రాండా దంపతులు ఆ ఆవును కనుగొనడంలో సాయపడ్డారు. ఇంతకూ ఆ దంపతులు శాకాహారులు. గుర్రాలు, మేకలు, కుక్కలు, కుందేళ్ళు మొదలైన వాటిని సంరక్షించే 'పీస్ అబే ఫార్మ్'ను నడుపుతున్నారు. వారి జంతు ప్రేమను మెచ్చి, మాంస విక్రయశాల యజమాని, ఎమిలీని 500 డాలర్లు చెల్లించి కొనడానికి పలువురు వచ్చినప్పటికీ, వారందరినీ కాదని దానిని పేరుకు ఒక డాలర్ పుచ్చుకుని రాండా దంపతులకు అప్పగించాడు. శాకాహారం గురించి ప్రచారం చేయడానికీ, జంతువులను ఎలా పెంచాలో పిల్లలకు నేర్పడానికీ ఎమిలీని ఉపయోగించగలమని రాండా దంపతులు చెప్పారు. ఎమిలీ కథ త్వరలో చలనచిత్రంగా రానున్నది!



## నీళ్ళంటే మంట!

ఇది ప్రపంచంలోనే వింతయిన విషయమని చెప్పవచ్చు. జర్మనీకి చెందిన ఎనిమిదేళ్ళ హైడీ ఫాల్క్‌నర్ అనే అమ్మాయి నీళ్ళు తాగాలన్నా, నీళ్ళలో స్నానం చేయాలన్నా విలవిలలాడిపోతున్నది పాపం!



# ఎదుటివాడి దుఃఖం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసినడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వుఅలౌకిక, అద్భుత శక్తులు గలవాళ్ళనెవరినైనా నమ్మి, ఏ మహత్కార్యాన్నో సాధించేందుకు రాత్రివేళ ఈశ్మశానంలో పడరాని పాట్లు పడుతున్నావేమో! అదే నిజమైతే నీ మేలు కోరి నేనొక సలహా ఇవ్వదలిచాను. లోకంలో ఏదో కొంత మినహాయింపూ, నియమ నిబద్ధమూ కాని సంపూర్ణత్వమంటూ ఉండదు. తపోధనులైన మునులూ, యోగులూ, సాధువులూ, బైరాగులూ ఒక్కొక్కసారి తాము సాధించిన శక్తుల విషయంలో భంగపాటుకు గురవుతూంటారు. అందువల్ల, వివేకి, అలాంటి వాళ్ళను నమ్మే ముందుతగు జాగ్రత్తలో వుండాలి. ఇందుకు ఉదాహరణగా, ఎన్నో అద్భుతశక్తులుగల ఒక బైరాగి ఒకానొక

## బేతాళ కథలు



సామాన్య పండితుడి వల్ల పడిన భంగపాటు గురించి చెపుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒక గ్రామంలో భద్రుడనేవాడు వీధి అరుగు మీద కూర్చుని పురాణం చదువు కుంటూంటే బైరాగి ఒకడు వచ్చి, "భిక్షాం దేహి!" అన్నాడు.

భద్రుడు తలెత్తి బైరాగిని చూసి, "నీకు భిక్షవేస్తే నాకేమిటి లాభం?" అని ప్రశ్నించాడు.

"నేను సర్వసంగ పరిత్యాగిని. నా వంటి వాడికి బిచ్చం వేస్తే పుణ్యం వస్తుంది. ఆ పుణ్యం బ్రతికున్నంత కాలమూ నిన్ను సుఖ పెడుతుంది. ప్రాణంపోయాక ఉత్తమ లోకా లకు తీసుకుని వెళుతుంది," అన్నాడు బైరాగి.

"పుణ్యం సంపాదించడానికి పురాణాలు చదువుకోవచ్చు. దేవుడికి నమస్కరించు కోవచ్చు. అవి ఖర్చులేని పనులు. నీ వంటి వాడికి తిండిపెట్టడం ఖర్చుతో కూడిన పని. నేనడిగిందిస్తానంటే, నీకుబిచ్చమేం కర్మ, కడుపు నిండా తిండి పెడతాను," అన్నాడు భద్రుడు.

బైరాగి వాడిని ఏంకావాలో అడగమన్నాడు.

"ఎదురింట్లో సత్కారుడనే పండితుడు న్నాడు. అతడికి దుఃఖం కలగాలి. అందు కొక వరమివ్వు. నాకేమో సంతోషం కలిగేలా ఇంకో వరం కావాలి. మొత్తం రెండువరాలు. ఇంతే నాకు కావలసింది," అన్నాడు భద్రుడు.

"నేను నీకు ఒకే ఒక్క వరమివ్వగలను. అదీ నీ సంతోషం కోసమైతేనే ఇస్తాను. ఎట్టి పరిస్థితులలోనూ ఎదుటివాడికి దుఃఖం కలగ రాదు," అన్నాడు బైరాగి.

"వెళ్ళు, వెళ్ళు! నీకూ నాకూ సమయం వృధా!" అన్నాడు భద్రుడు చిరాగ్గా.

బైరాగి అక్కణ్ణించి కదిలాడు. అంతలో భద్రుడి భార్య లోపలినుంచి వచ్చి, "అయ్యో! బైరాగి వరమిస్తానంటే వద్దని పంపేశావు. అదేం తెలివి? ఆ వరాన్ని ఎదురింటి సత్కా రుడు పుచ్చుకుని ప్రయోజనం పొందుతాడో, ఏమిటో?" అంటూ కలవరపడింది.

భద్రుడు నవ్వి, "వెర్రిదానా! వరమిచ్చే టంత మహిమ ఉన్నవాడు, ఇలా వీధుల వెంట అడుక్కుంటూ తిరగడు. కోటి విద్యలు కూటికొరకే అంటారు. తిండికోసం వాడు బైరాగివేషం వేశాడు. అంతే!" అన్నాడు.

"అయితే బైరాగిని అంతసేపు నిలబెట్టి ఎందుకు మాట్లాడావు? వరాలెందుకు అడి గావు?" అన్నది భద్రుడి భార్య.

"తిండి పెడతానని ఆశ పెట్టి, ఆ తర్వాత గొంతెమ్మ కోర్కెలు కోరి పంపేయడం నాకు

సరదా! అదే చేశాను," అన్నాడు భద్రుడు నవ్వుతూ.

"ఒకవేళ బైరాగి నువ్వడిగిన రెండువరాలు ఇస్తానంటే,ఏం చేసేవాడివి?" అన్నది భద్రుడి భార్య, భద్రుడి వంక కుతూహలంగా చూస్తూ.

"కొందరు బైరాగులకు క్షుద్రశక్తులుంటాయి. అలాంటివాళ్ళు నన్ను సంతోషపెట్ట గలిగినా లేకున్నా,ఎదుటివాడికి తప్పక దుఃఖం కలిగించగలరు. వీడు అలాంటి బైరాగేమో అని ఆశపడ్డాను. కానీ కాదు," అన్నాడు భద్రుడు.

మెల్లగా నడిచిపోతున్న బైరాగికీ మాటలు వినిపిస్తూనే ఉన్నాయి. ఆయన ఎదురింటి ముందు ఆగి, "భిక్షాందేహి!" అన్నాడు.

వెంటనే ఆ ఇంటి తలుపులు తెరుచుకున్నాయి. లోపలినుంచి సత్కారుడు బయటకు వచ్చి బైరాగిని చూసి,"ఆహాః! నేడెంత సుదినం. ఆడబోయిన తీర్థం ఎదురయింది. చచ్చి స్వర్గాన ఉన్న మా తాతగారి జన్మదినం ఈ రోజే! బ్రతికినంత కాలం అతిథి మర్యాదల కోసమే జీవించి, అందుకు మా ఆస్తినంతా కరిగించిన ఆయన పుట్టినరోజున, మేము ఉడుతాభక్తిగా సత్పురుషుడొకడికి భోజనం పెట్టడం మామూలు. ఆ పనిమీదే బయల్దేరబోతూండగా తమరు కనిపించారు. లోపలకు రండి," అంటూ ఆయనను సాదరంగా లోపలకు తీసుకుని వెళ్ళాడు.

అక్కడ బైరాగికి సకల మర్యాదలూ జరిగాయి. సత్కారుడి తమ్ముడు,బైరాగికి కాళ్ళు కడిగి ముఖ ప్రక్షాళనానికి నీళ్ళందించాడు. సత్కారుడి భార్య ఆయనకు పీటవేసి, విస్తరి ముందుపరిచి రుచికరమైన వంటకాలుకొసరి



కొసరి వడ్డించింది. ఆయన భోంచేస్తున్నంత సేపూ సత్కారుడి చెల్లెలు భక్తితో వీవన పట్టింది.

భోజనమయ్యాక బైరాగి, సత్కారుడితో, "అతిథి మర్యాదలలో నీ కుటుంబానికిసాటి రాగలవారు లేరు.నాకెంతో సంతోషమైంది. నీకేంకావాలోకోరుకో.తప్పక ఇస్తాను,"అన్నాడు.

సత్కారుడు, బైరాగికి వినయంగా నమస్కరించి,"అయ్యా, నా సంతోషం కోసంమీకు ఆతిథ్యమిచ్చాను. మీనుంచి ప్రతిఫలమాశిస్తే, నాది పూటకూళ్ళ ఇల్లవుతుంది. మీ సంతోషమే నా సంతోషం. నాకింకేమీ వద్దు," అన్నాడు.

బైరాగి ఈమాటలకు సంతోషించి, "నేను నీకు అతిథిని.అతిథి భగవంతుడితోసమానం. భగవంతుడు వరమిస్తానంటే కాదనడం



నీకు తగదు.అది అతిథిమర్యాదను భంగ పర్చడమే అవుతుంది," అన్నాడు.

అప్పుడు సత్కారుడు తన కుటుంబ సభ్యులందరినీ సంప్రతించాడు. అందరూ ఒక నిర్ణయానికి వచ్చాక సత్కారుడు బైరాగితో,"అయ్యా! ఏడాదిక్రితం నా తండ్రి పోయాడు. అప్పటినుంచీ నా తల్లి మనో వ్యాధితో మంచం పట్టింది. ఎన్ని మందులు వాడినా ఆమెకు నయం అవడం లేదు.రోజు రోజుకూ ఆమె క్షీణించిపోతూంటే,మా అంద రికీ ఎంతో బాధగా ఉంది. ఆమె మనోవ్యాధి కుదిర్చి, ఎప్పటిలా మాతో మసిలేలా చేయ గలరా?" అన్నాడు.

ఇది వింటూనే బైరాగి ముఖం గంభీరంగా మారిపోయింది. ఆయన ఏదో ఆలోచనలో పడి కళ్ళు చిట్లించాడు. కాసేపాగి, "నాయనా! నువ్వు చాలా మంచివాడివి. నీ మంచితనమే నీకు శాపం కావచ్చు.నీ మంచితనాన్నివిడిచి పెడితే తప్ప, నీ తల్లికి నయం కాదేమోనని నా అనుమానం.నీ తల్లికోసం నువ్వు ఏం చెయ్య డానికైనా సిద్ధంగా ఉన్నావా?"అని అడిగాడు.

"మీమాటలు నాకు అర్థంకావడం లేదు, స్వామీ!" అన్నాడు సత్కారుడు.

అప్పుడు బైరాగి అతడికి ఎదురింటి భద్రుడి కథ చెప్పి, "నిజానికి నా వద్ద ఒక గుళిక ఉన్నది. అది నోట్లో వేసుకున్నాక, ఎదుటివాడికి దుఃఖం కలిగించేలాగానూ, తనకు సంతోషాన్ని కలిగించేలాగానూ- రెండు వేర్వేరు వరాలు కోరుకుంటే వెంటనే ఫలి స్తాయి.ఒకే వరం కోరుకుంటే ఏదీ ఫలించదు సరికదా, అనర్థం కూడా జరుగుతుంది.నేను నీకు గుళికనిస్తాను. నీ తల్లికి ఆరోగ్యంకోరు కుని సంతోషంపొందు.అయితే, ఎదురింటి భద్రుడికి దుఃఖంకూడా కలిగించు. వాడు నీకు దుఃఖం కలిగించాలని పట్టుదలగా ఉన్నాడు కాబట్టి, నువ్వు వాడికి దుఃఖం కలిగిస్తే అది తప్పు కాదు," అన్నాడు.

ఈ మాటలకు సత్కారుడాశ్చర్యపడి, "అయ్యా! తమ వద్ద ఇటువంటి గుళిక ఉన్న ప్పుడు,భద్రుడి ఆతిథ్యాన్ని అంగీకరించి దాన్ని వాడికే ఎందుకివ్వలేదు? గుళిక ఇచ్చే రెండు వరాలూ వాడికి సంతోషాన్ని కలిగిస్తాయి. ఎదుటివాడికి దుఃఖం కలిగించడం, నాకు మనశ్శాంతి లేకుండా చేస్తుంది. నా తల్లి అనారోగ్యంతో వున్నా నాకు బాధ లేదు. మీ గుళిక నాకు వద్దు," అన్నాడు.

దానికి బైరాగి కాదన్నట్టు తల వూపి, "భద్రుడికి గుళికను పొందే యోగ్యత లేదు.

అందుకే నేను వాడింట్ల ఆతిథ్యం స్వీక రించలేదు. నువ్వు యోగ్యుడివి కాబట్టి నీకీ గుళిక ఇస్తున్నాను. నువ్వు దీనిని కాదంటేఅతిథి మర్యాదలను ఉల్లంఘించినట్టే! భద్రుడి వంటివాడు, నీ ఇంటిఎదుట వుండడం వల్ల, నీ యోగ్యతకు భంగం కలగకుండా, ఈ గుళికను వినియోగించుకోవడం నీకు వీలు పడుతుంది," అంటూ బైరాగి, సత్కా రుడికి తన వద్దనున్న గుళికను ఇచ్చి వెళ్ళి పోయాడు.

సత్కారుడు తటపటాయించకుండా గుళికను నోట్లో వేసుకుని, "నా తల్లి ఎప్పటిలా సంపూర్ణారోగ్యవంతురాలు కావాలి. నా ఇల్లొక అద్భుతభవనంగా మారిపోవాలి!" అన్నాడు.

అది విని సత్కారుడి కుటుంబసభ్యు లందరూ కంగారుపడి, "అయ్యో! రెండు వరాలూ మనకు మేలు కలిగించేవే! ఇప్పుడే అనర్థం జరుగుతుందో ఏమిటో?" అన్నారు.

అంతలో అక్కడికి ఒక వృద్ధురాలు చక చకా నడుచుకుంటూ వచ్చి, "ఏమిట్రా, అంతా ఇక్కడున్నారూ? ఆకలితో నకనకలాడిపోతు న్నాను. నాకేమైనా భోజనం ఏర్పాట్లున్నాయా, లేవా?" అంటూ అందర్నీ గదమాయించింది.

చక్కని ఆరోగ్యవంతురాలిగా వచ్చిన తల్లిని చూసి, సత్కారుడు పరమానందం చెంది, "అమ్మా! నువ్వు మళ్ళీ మామూలు మనిషివి అయ్యావు. నాకెంతో సంతోషంగా ఉంది," అని భార్యవైపు తిరిగి, "అమ్మకు భోజనం ఏర్పాట్లు చూడు!" అన్నాడు.

సత్కారుడి భార్య అక్కణ్ణించి కదలబోయి, "ఇదేమిటి? మన ఇల్లు పూర్తిగా మారిపో యింది. వంటిల్లెక్కడో వెదుక్కోవాలి!" అన్నది.




సత్కారుడితో సహా అందరూ తమ ఇల్లు అద్భుతభవనంగా మారిపోవడం గమనించి, బయటనుంచి చూస్తే ఎలాఉంటుందో అన్న కుతూహలంతో వీధివైపుకు వచ్చారు.

అప్పుడు ఎదురంటి భద్రుడు, సత్కారుడికి పట్టిన అదృష్టం కళ్ళారా చూసి భరించలేక అరుగు మీద కూర్చుని, ఆగని కన్నీళ్ళను పైపంచతో తుడుచుకుంటున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, బైరాగి ఎంతో కొంత అద్భుతశక్తులు కలవాడనడంలో సందేహం లేదు. అయితే, అతడు తాను పరిపూర్ణ శక్తిమంతుడినన్న భ్రమతో వున్నట్లు కనబడుతున్నాడు. తాను ఇచ్చే గుళిక వల్ల రెండువరాలు లభ్యమవుతాయనీ, అందులో ఒకటి తన సంతోషానికి కోరుకోవాలనీ, రెండవది ఎదుటివాడికి దుఃఖం కలిగేందుకు

కోరుకోవాలనీ సత్కారుడికి చెప్పాడు. అంతే కాక,రెండువరాలు తన సంతోషానికే కోరు కుంటే అనర్థం వాటిల్లుతుందని కూడా హెచ్చరించాడు. అయినా, సత్కారుడు రెండు వరాలూ తన సంతోషానికే కోరుకున్నా ఎలాంటి అనర్థం జరగకపోగా, రెండూ ఫలించాయి. ఈ కారణం వల్ల, బైరాగి తాను సాధించానను కుంటున్న అద్భుతశక్తుల విషయంలో భంగ పాటు చెందినట్టే గదా? ఇక సత్కారుడిమాట కొస్తే, అతడు బైరాగి హెచ్చరికను ఎందుకు పాటించలేదు? అతడికి బైరాగి అద్భుత శక్తుల విషయంలో నమ్మకం లేదని అనుకో వలసిందే కథా? ఈ సందేహాలకు సమాధా నాలు తెలిసి కూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు,"జరిగినదాన్ని సుని శితంగా పరిశీలించిప్పుడు, బైరాగీ, సత్కా రుడూ ఇద్దరికీ ఇద్దరు ఎట్టి పరిస్థితులలోనూ అధర్మానికి ఒడిగట్టనివాళ్ళని తేలుతుంది. తనకు భిక్ష వేయకపోగా, అవమానకరంగా మాట్లాడిన భద్రుడిని, బైరాగి తనకు తానుగా శపించగలడు. కానీ అతడా పని చేయలేదు. అటువంటి ధర్మపరుడు, మరొకరి ద్వారా భద్రుడికి దుఃఖం కలిగేలా చేస్తాడనుకోవడం సందర్భశుద్ధి అనిపించుకోదు.అయితే, అతడు తానివ్వదలచిన రెండు వరాల్లో ఒకటి తన సంతోషానికీ, రెండవది ఎదుటివాడి దుఃఖానికీ కోరుకోవాలని సత్కారుడితో చెప్పడం, అతడి ధర్మగుణాన్ని పరీక్షించేందుకు మాత్రమే! ఇది గ్రహించడం వల్లనే పండితుడైన సత్కా రుడు, కుటుంబ సభ్యులు వారిస్తున్నా వినక, తనకు సంతోషం కలిగించే రెండు కోర్కెలు కోరుకున్నాడు. అవి ఫలించినై. ఈ కారణం వల్ల, బైరాగి తాను అద్భుతశక్తులు కలవాడ ననే భ్రమతో ఉన్నాడనుకోవడం నిజం కాదు. ఇక భద్రుడి ప్రవర్తన విషయానికొస్తే - అలాంటి అసూయాపరులు లోకంలో కోకొల్లలు. తన ఇంటి మామిడిచెట్టు ఒక పిందెవేసి, ఎదుటివాడి ఇంటి చెట్టు రెండు పిందెలు వేస్తే,వాళ్ళు భోరుమంటూదుఃఖించ గలరు. వాళ్ళు పుట్టుకతోనే శాపగ్రస్తులు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై,తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]





# చావుతెలివి

తనకు తాను చాలా తెలివైన దానిలా భావించుకునే కాంతమ్మ, ఉన్న ఒక్కగానొక్క కోడలు లక్ష్మిని చిత్రంగా సాధించేది. లక్ష్మి మంచిచీర కట్టుకోబోతే, "వద్దమ్మా, అసలే అందమైన పిల్లవు! దిష్టి తగులుతుంది," అనేది. కోడలు మనసు పడి ఏదైనా పిండి వంటచెయ్యబోతే, "అయ్యో, నా తల్లీ!అవీ ఇవీ తిని నీ ఆరోగ్యం పాడుచేసుకుంటే,నేను భరించగలనా?" అనేది.

ఇలా ఉండగా – సహజంగా భక్తురాలైన లక్ష్మి, ఒకసారి ఏదో నోము నోచుకోవాలని తలపెట్టింది. అయితే, అది కూడా సహించ లేక కాంతమ్మ, "అయ్యో, వెర్రిపిల్లా! నోములూ వ్రతాలూ చెయ్యటం కంటే, నిర్మల భక్తితో ఆ దేవదేవుణ్ణి ధ్యానించడమే ఉత్తమ మార్గ మని నువ్వు వినలేదా? తిండి కూడా సరిగ్గా తినకుండా, ధ్యానంలో గడపడం వల్లనే, మహర్షులుఅంతగొప్పవాళ్ళయ్యారు," అన్నది.

అత్తగారు తనను నోము నోచుకోనివ్వదని లక్ష్మి గ్రహించింది. అయితే, అత్తగారికి ఎదురు చెప్పే ధైర్యం లేని ఆమె, చివరకు తనలో తాను, "అవును, నిజమే! భక్తి వుండాలే గాని, భగవంతుణ్ణి ఆరాధించటానికి నోములూ, వ్రతాలూ అక్కర్లేదు. ఈ క్షణం నుంచి నిశ్చలమైన మనస్సుతో, ఆ సర్వేశ్వ రుణ్ణి ధ్యానించటం ఒక్కటే నా పూజ!" అనుకుని అలాగే చెయ్యటం మొదలు పెట్టింది.

కొన్నేళ్ళు అలా జరిగాక, వృద్ధురాలైన కాంతమ్మ చనిపోయింది. యమభటులు, ఆమెను ముందుగా స్వర్గానికితీసుకుపోయారు.

మొదటినుంచీ తను మహాతెలివైన దాని నని గర్వపడే కాంతమ్మ, యమభటులుతనను స్వర్గానికి తీసుకువెళ్ళటం చూసి మరింత గర్వపడింది. అయితే వాళ్ళు, ఆమెను స్వర్గంలో వుంచింది, ఒక్క క్షణకాలం మాత్రమే.

'లలిత – శర్మిల'

ఆమె ఇంకా స్వర్గమంతా కలియ చూడకుండానే, యమభటులు ఆమెను యమపాశంతో బంధించి, నరకానికి తీసుకుపోయి, యమధర్మరాజు ఎదుట నిలబెట్టారు.

కాంతమ్మ, యమధర్మరాజు కేసి చురచుర చూస్తూ, "ఏమిటయ్యా ఇది? వీళ్ళు ముందు నన్ను స్వర్గానికి తీసుకు వెళ్ళి, క్షణాల మీద ఈ నరకానికి తీసుకు వచ్చారు! ఎందువల్ల?" అంటూ ప్రశ్నించింది.

దానికి యమధర్మరాజు శాంతంగా, "కాంతమ్మా! నువ్వు జీవితంలో సంపాదించుకున్న పుణ్యం, నువ్వు ఒక్క క్షణం మాత్రమే స్వర్గంలో గడపడానికి సరిపోయేంతటిది. పోతే నీ పాపం పూర్తిగా ప్రక్షాళన కావటానికి, నువ్వు నూరు సంవత్సరాల పాటు నరకంలో వుండవలసి వుంటుంది," అన్నాడు.

ఆ మాట వింటూనే కాంతమ్మ, "ఇదేం న్యాయం? అంత పాపం నేనేం చేశాను? ఉన్న ఒక్కగానొక్క కోడల్ని ఏనాడైనా ఒక్క చిన్న పరుషపుమాట అని ఎరుగుదునా?" అన్నది.

అందుకు యమధర్మరాజు నవ్వి, "నువ్వు నీ జీవితకాలంలో ఎన్నడూ ఒక్క పరుషపు మాట కూడా అనని సంగతి నిజమే! కాని, త్రికరణాలైన మనోవాక్కాయ కర్మల్లో, మనస్సు ప్రథమస్థానం వహిస్తుంది. నీకు ఆ మనశ్శుద్ధే లోపించింది. మనసులో కల్మషం దాచుకుని, పైకి ఆప్యాయంగా మాట్లాడే నీ వంటి వ్యక్తుల మాటలనే, 'తేనె పూసిన కత్తులు' అంటారు. నీ కల్మషబుద్ధి చివరకు, నీ కోడలు నోములు నోచుకోవటాన్ని కూడా సహించలేకపోయింది. నీ అలవాటు ప్రకారం, క్రోధాన్ని మనసులోనే దాచుకుని, పైకి, ఆ అమాయకురాలికి నిశ్చలధ్యానం గురించి బోధించావు. ఆమెఅలాగే భగవంతుణ్ణి ధ్యానంతోనే ఆరాధించి, ఎంతో పుణ్యం సంపాదించుకున్నది," అన్నాడు.

"నిజమా? అప్పట్లో ఆ సంగతి గ్రహించలేకపోయాను!" అంటూ కాంతమ్మ నివ్వెరపోయింది.

"నీ వంటి మూర్ఖులూ, అహంకారులూ గ్రహించలేకపోవడం సహజం! ఏమైతేనేం, నీ కోడలు అంత పుణ్యాత్మురాలు కావడానికి పరోక్ష కారకురాలివి నువ్వు. అందువల్లనే నీకు క్షణకాలం స్వర్గంలో గడిపే అర్హత లభించింది. ఇహ పరాలు రెండూ దక్కించుకోలేని చావుతెలివి నీది!" అన్నాడు యమధర్మరాజు.



సముద్రతీర ప్రయాణాలు: **12**

# తిరువనంతపుర మార్గం

రచన: మీరా నాయర్ ▲ చిత్రాలు:గౌతమ్‌సేన్

సముద్రంలోకి ప్రవహించే పెరియార్ మొదలైన నదులు నూనెతో కలిసినట్టున్న ఒక రకం బురదను కొట్టుకువచ్చి సముద్రంలోకి చేరుస్తున్నాయి. ఋతుపవనాలు ప్రారంభం కాగానే ఈ బురద కలియదీయబడి, నీటి ఉపరితలం అడుగుకు చేరుతుంది. వీటిని బురదగట్టులు అంటారు. ఇవి అడ్డుగా ఏర్పడి తీరం వైపున ఉన్న నీటిని తుఫాను సమయంలో కూడా అల్లకల్లోలం కాకుండా ప్రశాంతంగా ఉంచుతాయి!

ఈ బురదగట్టుల వల్ల, మలబారు తీరంలో ఏర్పడిన లంగరు వేయడానికి అనువైన స్థలాలను అరబ్ వ్యాపారులు పూర్వకాలంలో చక్కగా ఉపయోగించుకున్నారు.




ఆలప్పుళా నుంచి కొల్లంకు 85 కి.మీ దక్షిణంగా ప్రయాణం చేయాలి. దారి పొడవునా అందమైన జలాశయాలు, వాటిలోని కలువలు, తామరలు, ఎగిరే నీటిపక్షులు కనులవిందు చేస్తాయి. మార్గమధ్యంలోని అంబలప్పుళాలో శ్రీకృష్ణమందిరం ఉన్నది. ఇక్కడ ప్రసాదంగా ఇచ్చే బియ్యం పాయసం చాలా ప్రసిద్ధమైనది.



ఓట్టం తుళ్ళల్

ఓట్టం తుళ్ళల్ అనే కళాప్రక్రియ ఇక్కడే ఆరంభమయింది. ఈ ప్రాంతంలో ఒకప్పుడు చక్కియర్ కూత్తు అనే నాటక ప్రక్రియ ప్రాచుర్యంలో ఉండేది. పురాణ సంబంధమైన పాటలనూ, జానపద గేయాలనూ, సామాజిక గీతాలనూ పాడుతూ చక్కియర్ కులస్థులు ఈ నాటకం ప్రదర్శించేవాళ్ళు. అటువంటి ఒక నాటక బృందానికి కుంజన్ నంబియార్ అనే కవి మిళావు (రాగితో కుండ ఆకారంలో చేసిన వాయిద్యం) వాయించేవాడు. ఒకనాడు అలా వాయిస్తూ నంబియార్ ప్రదర్శన సమయంలోనే నిద్రపోయాడు. దానికి చక్కియర్ బృందం నాయకుడు ఆయన్ను తిట్టడంతో, నంబియార్ అవమానభారంతో అక్కడి నుంచి వెళ్ళిపోయి, చక్కియర్ కూత్తుకు పోటీగా, దానికి కొన్ని నాట్య రూపాలు మేళవించి, 'ఓట్టం తుళ్ళల్' అనే సరికొత్త నాటక ప్రక్రియను సృష్టించాడని చెబుతారు.

నంబియార్ మొట్టమొదట ఓట్టం తుళ్ళల్





ఓట్టంతుళ్ళల్ మొట్టమొదట ▲ ప్రదర్శించిన అంబలప్పుళా కృష్ణమందిరంలోని మంటపం

చక్కియర్ కూత్తుకు ► కుంజన్ నంబియార్ ఉపయోగించిన మిళావు

ప్రదర్శించిన ఆలయ ప్రాంగణంలోని మంటపంలో ఆయన ఉపయోగించిన 'మిళావు'ను గత జూన్ నెలలో ప్రతిష్ఠించారు.

ఆలప్పుళాకు దక్షిణంగా కాయంకుళం అనే తీరపట్టణం ఉన్నది. కేరళ రాబిన్‌హుడ్‌గా ప్రసిద్ధి గాంచిన కాయంకుళమ్ కొచ్చుణ్ణి జన్మస్థానం ఇది. పేదలకు సాయపడడానికి అతడు ధనికుల నుంచి దోచుకునే వాడు. ఆ 18వ శతాబ్దపు బందిపోటు ఉపయోగించిన ఆయుధాలు కొన్ని, అతన్ని బంధించిన జైలులో ఇంకా ఉన్నాయి.

చరిత్ర ప్రసిద్ధిగాంచిన కొల్లం పట్టణం అష్టముడి తటాకతీరంలో ఉన్నది. దీనిని పూర్వం క్విలాన్ అని పిలిచేవారు. మలబారు తీరంలోని అతి ప్రాచీనమైన రేవుపట్టణాలలో ఇది ఒకటి. పూర్వకాలంలో వివిధ దేశాల నుంచి వ్యాపార ఓడలు ఇక్కడికి వచ్చేవి. ఈ ప్రాంతంలో లభించే మిరియాలు ప్రధాన ఆకర్షణ. సంస్కృతంలో 'కోలం' అంటే మిరియాలు అని ఒక అర్థం ఉన్నది. దానిమీదే ఈ పట్టణానికి 'కొల్లం' అనే పేరు వచ్చిందని చెబుతారు.

13వ శతాబ్దంలో చీనా దేశస్థులు మలబారు తీరంలో కొల్లంను తమ ప్రధాన వ్యాపారస్థావరంగా చేసుకున్నారు. ఆ కాలంలో స్వతంత్ర సంస్థానంగా ఉన్న కొల్లం చీనాతో దౌత్య సంబంధాలు కూడా పెంచుకున్నది.

కొల్లం జిల్లాలోనే పవిత్రమైన శాస్తా మూట్టా తటాకం ఉన్నది. కేరళలో ఉన్న ముఖ్యమైన మంచినీటి తటాకం ఇదొక్కటే. ఈ తటాక సమీపంలో ఉన్న శాస్తామందిరాన్ని శ్రీరాముడు నెల కొల్పినట్టు భక్తులు విశ్వసిస్తారు.

ఆలప్పుళా జిల్లాలోని సముద్రతీరాలు తెల్లగా వెండిలా మెరుస్తూ ఉంటాయి. అయితే ఇక్కడి ఇసుకలో ఇల్మనైట్, బాక్సైట్ అనే ఖనిజ పదార్థాలు కలిసి ఉండడం వల్ల ఈ తీరప్రాంతాలు కొద్దిగా నల్లగా ఉన్నాయి.

ఇక్కడికి 20 కి.మీ దూరంలో దక్షిణంగా అంజేంగో (అంజు- తెంగు) తీరపట్టణం ఉన్నది. ఇంగ్లీష్ ఈస్టిండియా



దూరతీరాల వ్యాపారులను ఆకర్షించిన మిరియాలు

కంపెనీ ఇక్కడ, మలబారు తీరంలో తన మొట్టమొదటి వ్యాపార స్థావరాన్ని ప్రారంభించింది. ఇక్కడికి తొలుత వచ్చిన ఆంగ్లేయులు నిర్మించిన పాత కోట ఒకటి ఇంకా ఉన్నది.

అంజేంగో సమీపంలోనే ఆరోగ్యకేంద్రమూ, యాత్రా స్థలమూ, విశ్రాంతి విడిదీ అయిన వర్కాలా ఉన్నది. ఇక్కడ సముద్రతీర రేఖ నుంచి లేచిన బ్రహ్మాండమైన ఎర్రటి బండల నుంచి నీటిబుగ్గలు పెల్లుబుకుతున్నాయి.

సుప్రసిద్ధ మత సంస్కర్త శ్రీ నారాయణగురు వర్కాలాలోని శివగిరి కొండ మీదే తన అంతిమశ్వాస వదిలారు. శ్రీ నారాయణగురు 'ఒకే కులం, ఒకే మతం, ఒకే దేవుడు!'అనే సిద్ధాంతాన్ని గాఢంగా విశ్వసించి ప్రచారం చేశాడు. కుల మత భేదాలు పాటించకుండా మనుషులందరూ అభివృద్ధి సాధించాలని ఆయన ప్రబోధించాడు.



శ్రీ నారాయణగురు

జనార్దన మందిరంలో శ్రీకృష్ణుణ్ణి 'వర్కాలప్పన్'గా పూజిస్తారు. ఇది హిందువులకు ముఖ్యమైన యాత్రాస్థలం.

వర్కాలకు 48 కి.మీ దక్షిణంగా కేరళ రాష్ట్ర రాజధాని తిరువనంతపురం ఉన్నది. తిరు అనంత పురం అంటే వేయి పడగల ఆదిశేషుడి నిలయం అని అర్థం. నగరం సముద్రానికి అనుకుని చిన్న కొండల మీద ఉన్నది. నగరానికి ప్రధాన అలంకారంగా ఉంటున్నది పద్మనాభస్వామి ఆలయం. ఇది పద్మతీర్థం పుష్కరిణికి అభిముఖంగా ఉన్నది.

తిరువాన్కూరు రాజా మార్తాండవర్మ తిరువనంతపురాన్ని తన రాజధానిగా చేసుకున్నప్పుడు తన రాజ్యాన్ని శ్రీమహావిష్ణువుకు అంకితమిచ్చాడు. తిరువాన్కూరు రాకుమారులు తమను 'అనంత పద్మనాభస్వామి దాసులు'గా చెప్పుకోవడం గొప్పగా భావించారు. ఈనాటి ఆలయం 18వ శతాబ్దంలో నిర్మించబడింది.

అంజేంగోలోని కోట





తిరువనంతపురంలోని శ్రీ అనంత పద్మనాభస్వామి దేవాలయం

100 ఏనుగుల సహాయంతో 4,000 మంది తాపీ పనివాళ్ళు, 6,000 మంది కూలీలు ఆరు నెలలు కష్టపడి ఈ ఆలయాన్ని నిర్మించినట్టు చెబుతారు. ఆలయంలో అనంతుడైన ఆదిశేషుడి పాన్పు మీద మహావిష్ణువు పవళించిన భంగిమలో విగ్రహం ఉన్నది. దీర్ఘ చతురస్రాకారంలో ఉన్న ఆలయ మంటపం నాలుగు వైపులా 4,000 స్తంభాలు ఉన్నాయి. ప్రతి స్తంభం మీదా రెండు చేతులతో జ్యోతిని పట్టుకున్న భంగిమలో స్త్రీరూపాలు మలిచారు. సంధ్యాసమయంలో జ్యోతులు వెలిగించగానే ఈ స్త్రీరూపాలన్నింటికీ జీవం వచ్చినట్టు వింత శోభ ఏర్పడుతుంది. మెట్లమీదుగా వెళ్ళామంటే ఏడంతస్తుల గోపురం దగ్గరికి చేరుకుంటాము.

మన దేశంలోని రెండవ ప్రాచీనమైన జంతు ప్రదర్శనశాల తిరువనంతపురంలో ఉన్నది. (కలకత్తా జంతు ప్రదర్శనశాల అతి ప్రాచీనమైనది).

శ్రీచిత్ర ఆర్ట్ గ్యాలరీలో రాజపుత్ర, మొగల్ చక్రవర్తుల చిన్న చిన్న చిత్రాలు ఉన్నాయి. కేరళకు కీర్తి తెచ్చిన సుప్రసిద్ధ చిత్రకారుడు రాజారవివర్మ చిత్రాలు ఇక్కడ ప్రత్యేకంగా ప్రదర్శనకు ఉంచారు. ఈ చిత్ర కళామందిరంలో టిబెట్, చైనా, జపాను, బాలినీ శైలి చిత్రాలు కూడా ఉన్నాయి.

1972వ సం॥లో తిరువనంతపురంలో విక్రమ్ సారాభాయ్ అంతరిక్ష కేంద్రం ఏర్పరచబడింది. మన దేశంలోనే 'శాటలైట్ లాంఛ్ వెహికల్స్' అభివృద్ధి పరచడానికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానాన్నీ, పరికరాలనూ ఈ కేంద్రం సమకూరుస్తుంది.

రాజధానీ నగరానికి 18 కి.మీ దక్షిణంగా నెలవంక ఆకారంలో కోవలం సముద్రతీరం ఉన్నది. మన దేశంలోని అతి సుందరమైన సముద్రతీరాలలో ఇది ఒకటి. బ్రహ్మాండమైన బండలు దీనిని సముద్ర తరంగాల తాకిడి నుంచి కాపాడుతున్నాయి.

'రామకథాపాట్టు' రచించిన సుప్రసిద్ధ కవి అయ్యాపిళ్ళ ఆసాన్ కోవలంలోనే జన్మించాడు. దాదాపు కేరళ, తమిళనాడు సరిహద్దులో పూవార్ ఉన్నది. 970 మీ॥ ఎత్తయిన అగస్త్యకూడం కొండలలో పుట్టి ప్రవహించే నెయ్యార్ నది ఇక్కడే అరేబియా సముద్రంలో సంగమిస్తున్నది.




# అజయుడి కోరిక

చంద్రపుర రాజ్యం రాజు ధర్మసేనుడు, పేరుకు తగినట్టు ధర్మమూర్తి, మహావీరుడు. ఆయన ఆడిన మాట తప్పి ఎరగడు. ఇచ్చిన మాట కోసం ప్రాణాన్నయినా పణంగా పెట్టగలడని, సాటిరాజులు చెప్పుకునేవారు. ఆయన పాలనలో ప్రజలు చీకూ చింతా లేకుండా జీవిస్తున్నారు.

హిమగిరి, చంద్రపురానికి పొరుగురాజ్యం. ఆ రెండు రాజ్యాల మధ్య వైరం ఎన్నో ఏళ్ళుగా కొనసాగుతున్నది. ధర్మసేనుడు, తాత ముత్తాతల నాటి వైరం కొనసాగించ దలచక,హిమగిరిరాజు విక్రమవర్మతో స్నేహం చేయసంకల్పించాడు. అయితే, మూర్ఖుడూ, రాజ్య విస్తరణాభిలాష గలవాడూ అయిన విక్రమవర్మ అందుకు సమ్మతించక శత్రుత్వం కొనసాగించాడు.

ధర్మసేనుడు, విక్రమవర్మను అవలీలగా ఓడించగల సత్తా కలవాడైనప్పటికీ, అలాంటి ప్రయత్నం ఏనాడూ చెయ్యలేదు. విక్రమవర్మ మాత్రం చంద్రపుర రాజ్యాన్ని ఆక్రమించ డానికి ఏవేవో పథకాలు ఆలోచిస్తూండేవాడు.

ఏళ్ళు గడిచాయి. క్రమంగా విక్రమవర్మ తన సైనికబలాన్ని పెంచుకుని, ధర్మసేనుడి మీద యుద్ధం ప్రకటించాడు. తనకై తాను కాలు దువ్విన విక్రమవర్మను ఓడించి, తన పరాక్రమం నిరూపించుకోవడానికి ధర్మ సేనుడు సిద్ధపడ్డాడు. చంద్రపుర, హిమగిరి రాజ్యసైనికులు యుద్ధభూమిలో పోరు ప్రారం భించారు. కొద్ది వ్యవధి తర్వాత ధర్మసేనుడు, విక్రమవర్మ యుద్ధభూమిలో ముఖాముఖి తల పడ్డారు. అయితే, ఎవరూ విజయంసాధించ లేక, సూర్యాస్తమయవేళకు ఎవరి శిబిరాలకు వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆ మర్నాడు జరిగిన యుద్ధంలో శత్రు సైనికుడు విసిరిన ఈటె, ధర్మసేనుడి భుజాన్ని బలంగా తాకింది. ఆయన యుద్ధరంగం

ఎన్. శివనాగేశ్వరరావు.



నుంచి తనశిబిరానికి వెళ్ళిపోయాడు.వైద్యులు ఆయన గాయానికి కట్లు కట్టారు.

జరిగిన సంఘటనకు ధర్మసేనుడు కలతచెందాడు. ఇప్పుడేమి చేయడమాఅని ఆయన ఆలోచిస్తూండగా, సేనాధిపతి అక్కడికి వచ్చి, "ప్రభూ! మీరు విచారించకండి. గాయపడిన మీరు యుద్ధరంగానికి రాలేరు. నేను, నా సర్వశక్తులూ ఒడ్డి విక్రమవర్మను ఓడించగలను," అన్నాడు.

ఈ సేనాధిపతి ఎంతో రాజభక్తుడూ, ధైర్యశాలే గాని, యుద్ధతంత్రం అంతగా ఎరిగిన వాడు కాదని,ధర్మసేనుడికి తెలుసు. అయినా, అప్పటి విషమ పరిస్థితిలో చేసేది లేక, ఆయన సరే అన్నట్టు తలఊపాడు. సేనాధిపతి సేనాధిపతి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.ఆ రాత్రి చంద్రపుర సైన్యంలోని ఒక సైనికుడు, శిబిరంలో ధర్మసేనుణ్ణి ఒంటరిగా చూడ వచ్చి, "ప్రభూ! నా పేరు అజయుడు. ఈ మధ్యనే మన సైన్యంలో చేరాను. మీరు గాయపడిన సంగతి తెలిసింది. ఈ పరిస్థితిలో మీరు శత్రురాజు విక్రమవర్మతో యుద్ధం చేయలేరు. ఆ అవకాశం నాకుకల్పించండి. ఏదో విధంగా అతణ్ణిఒంటరిగా ఎదుర్కొని హతమార్చగలను," అన్నాడు.

ఒక సామాన్య సైనికుడు, విక్రమవర్మను ఎదుర్కొంటాననడం, ధర్మసేనుడికి ఆశ్చర్యం కలిగించింది. అది గమనించిన అజయుడు, "ప్రభూ! బాల్యం నుంచీ మా అవ్వ చెప్పిన కథలు వినీ వినీ, నా మనసులో ఒక కోరిక స్థిరపడిపోయింది. అది నెరవేర్చుకునే ప్రయత్నంలో అహర్నిశలు శ్రమించి యుద్ధ విద్యలు నేర్చాను. నా పరాక్రమం ఏ పాటిదో ప్రదర్శించి, తమరిని మెప్పించి, నా కోరిక తీర్చుకోవడానికే సైన్యంలో చేరాను," అన్నాడు.

"బావుంది! మరి నీకోర్కె ఏమిటోతెలుసుకోవచ్చా?" అని ప్రశ్నించాడు రాజు.

దానికి అజయుడు, "ప్రభూ! నా మనసులోని కోరికను, విక్రవర్మను అంతమొందించిన తర్వాతే వెల్లడిస్తాను. అయితే,అది తప్పక నెరవేరుస్తానని తమరుమాట ఇవ్వాలి," అన్నాడు.

ధర్మసేనుడు ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వుండి, "అజయా! నువ్వు నిజంగా విక్రమవర్మను ఓడించగలిగితే, నీ కోరిక ఏదయినా తప్పక తీరుస్తానని, నేను ఆరాధించే ధర్మదేవత సాక్షిగా ప్రమాణం చేసి చెబుతున్నాను," అన్నాడు.

తర్వాత ఆయన, సేనాధిపతిని పిలిపించి విషయం వివరించాడు.

మర్నాడు యుద్ధభూమిలో అజయుడు, విక్రమవర్మకు బాసటగా వున్న సైనికులను తరిమి కొట్టి, అతణ్ణి ఎదుర్కొన్నాడు. ఇది చూసిన విక్రమవర్మ కళవెళపడి, తన శక్తి నంతటినీ ఒడ్డి అజయుణ్ణి ఎదిరించ ప్రయత్నించాడు. అయితే, అది విఫలమై వెనుదిరిగి పారిపోజూసిన విక్రమవర్మ తలను, ఒక్క కత్తివేటుతో అజయుడు నరికివేశాడు.

తమ రాజు మరణం చూసి హిమగిరి సైనికులు చెల్లాచెదరయ్యారు. అజయుడి విజయవార్త విన్న ధర్మసేనుడు ఆనందంతో అతణ్ణి కౌగిలించుకుని అభినందించి, "ఈ సంతోషకరమైన సమయంలో, నీ మనసులోని కోరిక వెల్లడించు. అది నెరవేర్చి, నీకిచ్చిన మాట నిలుపుకుంటాను," అన్నాడు.

"ప్రభూ! నేను రాకుమారిని వివాహమాడదలిచాను. ఆమెతో నా వివాహం జరిపించండి," అన్నాడు అజయుడు వినయంగా.

అజయుడి కోరిక విన్నంతనే, ధర్మసేనుడు సంకట స్థితిలో పడ్డాడు. ఆయనకు ప్రియంవద ఒక్కతే కుమార్తె. ఆమెకు శరశ్చంద్రిక రాజ్య రాకుమారుడు వసంతసేనుడితో వివాహం నిశ్చయమయింది. ఆ విషయం ఇంకా ప్రజలకు తెలియబరచలేదు. నిశ్చయమైన వివాహాన్ని తప్పించలేడు. అలాగని అజయుడికిచ్చిన మాట తప్పలేడు.

ఆయన తనమనసులోనిబాధ బయటపెట్టకుండా, విజయుణ్ణి గౌరవంగా అంతఃపురానికి తీసుకుపోయి అతిథిమర్యాదలు జరిపించాడు.

ఆ రాత్రి ధర్మసేనుడు, కుమార్తె ప్రియంవదతో సంగతి వివరించి, "నీ వివాహం అజయుడితో జరిపిస్తే, వసంతసేనుడి వద్ద మాట తప్పిన వాడినవుతాను. వసంతసేనుడితో జరిపిస్తే, అజయుడికిచ్చిన మాట నిలబెట్టుకోలేను," అన్నాడు విచారంగా.



ప్రియంవద మంచి మేధావి. పరిపాలనా విషయాల్లో,ఆమె తండ్రికిసలహాలిస్తుంటుంది. ఆమెతండ్రికి ధైర్యంచెబుతూ, "నాన్నా ఈ సమస్యను నేను అందరికీ తృప్తికరంగా పరిష్కంస్తాను.మీరు మాట తప్పే పరిస్థితి రాదు,"అని హామీ ఇచ్చింది.

మర్నాటి ఉదయం ప్రియంవద, తన ప్రియచెలికత్తె వీణాధరికి తన అలంకరణ చేసి, ఏం చేయాలో చెప్పింది. వీణాధరి, అజయుడి మందిరానికి వెళ్ళింది. రాకుమార్తె అలంకరణలో వున్న ఆమెను చూసి అజయుడు, ఆమెను రాకుమారిగానే భావించాడు.

వీణాధరి అతడితో, "మీరు రాకుమారినివివాహమాడాలన్నకోర్కెలోవున్నారని,మహారాజుగారుచెప్పారు.నిజమే కదా?" అన్నది.

ఆ ప్రశ్న విని, అజయుడు పరమానంద భరితుడైపోయి, "అవును, రాకుమారీ, నిజం! నేనింతవరకూ రాకుమార్తెలు ఎలావుంటారో కళ్ళ చూసి ఎరగను. మీరు నా చిన్నతనంలో అవ్వ చెప్పిన కథల్లోని రాకుమారిలాగే వున్నారు. క్షత్రియేతరుడనైన నేను, ఎన్నోక్షాత్ర విద్యలు నేర్చి, ఈనాడు రాకుమారినివివాహమాడ బోతున్నానంటే – అందుకు మా అవ్వే కారణం!" అంటూ అడుగు ముందుకు వేయబోయాడు.

వీణాధరి చిరునవ్వుతో అజయుణ్ణి వారించి, "మహావీరుణ్ణి వివాహమాడబోతున్న నేను ధన్యురాలిని! త్వరలోనే మన వివాహం జరుగుతుంది," అని వెళ్ళిపోయింది.

ఈ జరిగినది కుమార్తె ప్రియంవద ద్వారా తెలుసుకున్న ధర్మసేనుడు, "అమ్మా! ఈ అజయుడు, మన రాజ్యాన్ని బలవంతుడైన శత్రురాజు నుంచి రక్షించాడు. అటువంటి వాడికి, వీణాధరిని రాకుమారి అని కట్ట బెట్టడం – నేను మాట తప్పడం అవుతుంది కదా?" అన్నాడు.

"అదేం లేదు, నాన్నా! ఆ మహావీరుడు వివాహమాడదలచింది, ఏదో ఒక రాకుమారిని,అంతే! ఇప్పుడు నువ్వు వీణాధరినిదత్తు చేసుకోబోతున్నావు. దత్తుకుమార్తె, కన్న కుమార్తెకు సమురాలన్నది శాస్త్ర విరుద్ధం కాదుకదా?" అన్నది ప్రియంవద.

ఆ తర్వాత ధర్మసేనుడు, వీణాధరినిదత్తు చేసుకుని, నెల తిరక్కుండానే అజయుడి కామెనిచ్చి, అత్యంత వైభవంగా వివాహం జరిపించాడు.



చందమామ



# బంగారు గడియలు

## 6

## రోబోట్ లెక్క

అంగారకగ్రహం క్రీ.శ. **2001**

ఓ! భూలోకవాసులారా! రోబోట్లు ఇక్కడ అంతరిక్షంలో నడిచే కార్లను తయారు చేస్తాయి!

54 రోబోట్లు ఇక్కడ... రోజుకు 54 కార్లు తయారుచేస్తాయి.

ఒక్కొక్క ఆల్ఫా రోబోట్ రెండు కార్లు తయారు చేస్తాయి...

బీటా రోబోట్లు రెండు కలిసి మూడు కార్లు తయారు చేస్తాయి...

మూడు గామా రోబోట్లు రోజుకు ఒక కారును తయారుచేస్తాయి

ఇప్పుడు మీరు ఇక్కడ ఎన్ని ఆల్ఫా, బీటా, గామా రోబోట్లు పనిచేస్తాయో చెప్పగలరా?



**4** మెరుపును విద్యుత్తుఅని రుజువు చేయడానికి ఒక సుప్రసిద్ధ విజ్ఞాన శాస్త్రవేత్త- రాజనీతిజ్ఞుడు అయిన మేధావి ప్రాణాలకు తెగించి పరిశోధనలుజరిపాడు. 1752వ సం॥లో ఆయన ఉరిమే మేఘాలకేసి గాలిపటాన్ని ఎగురవేసి, గాలిపటం దారాన్ని ఎలక్ట్రిసిటీ డిటెక్టర్‌కు కలిపాడు. ఆ విజ్ఞానశాస్త్రవేత్త ఎవరు?

2000 ??

**5** నాలుగేళ్ళకు ఒకసారి 'లీప్' సంవత్సరం వస్తుంది. సంవత్సరాన్ని నాలుగుతో భాగించినప్పుడు శేషం మిగలకుండా సరిపోతే అది లీప్ సంవత్సరం. అయితే, 100తో భాగించబడే 1800, 1900,2100 వంటి శతాబ్ద సంవత్సరాలు లీప్ సంవత్సరాలు కావు. మరి 2000వ సం॥ మాటేమిటి?



**7** మేరీ షెల్లీ తన సుప్రసిద్ధ నవల 'ఫ్రాంకెన్‌స్టీన్'లో భీకర మానవరూపాన్ని సృష్టించడానికి, వివిధ మానవ అవయవాలు ఎలా ఒకటిగా కలుపబడినవో వర్ణించింది. ఈ నవలలో, 'ఫ్రాంకెన్‌స్టీన్' ఎవరో తెలుసా?



**6** 'ప్లిమ్‌సోల్ లైన్' అన్నది నౌకలకు సంబంధించినది. అది ఎక్కడ ఉన్నది?

# రోబోట్ వేయడం నేర్చుకోండి!

రోబోట్ బొమ్మ వేయడం ఎలా? చాలా సులభం? ఆ బొమ్మను సులభమైన గొట్టాలుగా విడగొట్టండి! ఆ పద్ధతి ఇక్కడ చూపబడింది:



1.మొదట అస్థిపంజరం గీసుకోండి.



2.అస్థిపంజరానికి కండరాలు వేయండి. రొమ్ము. కడుపు. కాళ్ళు. చేతులకు గొట్టాలను వేసి. తల భాగాన్ని గుండ్రంగా గీసుకోండి.



3. అస్థిపంజరం గీతలను చెరిపేయండి. కండరాల. కీళ్ళ గీతలను గీసుకోండి.



4. ఇప్పుడు తుదిమెరుగులు దిద్దుకోండి. సులభంగా వేసేశారు కదా?



5.రోబోట్ బదులు కౌబాయ్ బొమ్మ కావాల నుకుంటే మళ్ళీ 2వ బొమ్మ దగ్గరికి వెళ్ళి. ఈ విధంగా దుస్తులు వేయాలి. అతని మొహంలో నవ్వు చిత్రించడాన్ని మరిచి పోకండి,నవ్వే మనల్ని మనుషులుగా చేస్తుంది!




శివుడి దర్శనం చేసుకోమని సలహా చెప్పి ఇంద్రుడు అదృశ్యంకాగానే అర్జునుడు శివుణ్ణి ఆరాధించ నిశ్చయించుకుని ముందుకు సాగాడు. అతనికి అమిత మనోహరమైన వనం ఒకటి తగిలింది. అందులోని చెట్లుచాలా అందంగా ఉన్నాయి. పూలనుంచి సువాసనలు వస్తున్నాయి. శివుణ్ణి గురించి తపస్సు చెయ్యటానికి ఆ సుందరవనరి చాలా అనుకూలమైన ప్రదేశంగా అర్జునుడికి తోచింది.

అర్జునుడు జడలు ధరించి, నారబట్టలు కట్టి, నాలుగు నెలలపాటు శివుణ్ణి గురించి అతి దారుణమైన తపస్సు చేశాడు. అతని నుంచి దారుణమైన వేడి పుట్టి, వనమంతా పొగ చుట్టవేసింది. అది చూసి ఆ వనంలో ఉండే ఋషులు శివుడి వద్దకు వెళ్ళి, అర్జునుడి కోరిక తీర్చి, అతని తపస్సు మాన్పించమని బతిమాలుకున్నారు. శివుడు వారితో, అర్జునుడి కోరిక తీర్చబోతున్నాననీ, భయపడ వద్దనీ చెప్పి పంపేశాడు.

ఋషులు వెళ్ళిపోగానే శివుడు కిరాతుడి వేషం ధరించాడు. పార్వతీ, ప్రమధులూ అతని అనుచరులకు తగిన వేషాలు ధరించారు. అందరూ కలిసి, అర్జునుడు తపస్సు చేసుకునే వనంలో విహరించసాగారు.

ఇదే సమయంలో మూకుడు అనే రాక్షసుడు పంది రూపంలో అర్జునుడి మీదికి చంపటానికి వచ్చాడు. తపస్సు చేసుకునే అర్జునుడు విల్లూ, బాణాలూ తీసుకుని ఆ పందిని చంపబోయాడు.

ఇంతలో, కిరాతుడి రూపంలో ఉన్న శివుడు అర్జునుడితో, "ఒరే, ఆ పందిని నేను కొడతాను, నువ్వు కొట్టకు!" అన్నాడు.

అర్జునుడు ఆ మాట లక్ష్యపెట్టక, పందిని బాణంతో కొట్టాడు. కిరాతుడు కూడా దాన్ని తన బాణాలతో కొట్టాడు. ఇద్దరి బాణాలూ

29. ఊర్వశి శాపం



తగిలి, ఆ రాక్షసుడు నిజస్వరూపంతో బయట పడి చచ్చాడు.

అప్పుడు అర్జునుడు కిరాతుడితో, "ఎవరు నువ్వు? నిర్జనమైన ఈ వనంలో ఆడదాన్ని వెంటబెట్టుకుని ఎందుకు తిరుగుతున్నావు? నన్ను చంపటానికి వచ్చిన ఈ రాక్షసుణ్ణి నేను కొట్టుతుంటే, నాతో సమంగా నువ్వు కూడా ఎందుకు బాణాలు వేశావు? ఇది వేటగాడి ధర్మం కాదు. ఇలా చేసినందుకు నేను నిన్ను చంపేస్తాను!" అన్నాడు.

కిరాతవేషంలో ఉన్న శివుడు అర్జునుడి మాటలకు నవ్వి, "నీ కెందుకు విచారం? ఇది మా ఆటవికుల ధర్మం. నిర్జనమైన ఈ అరణ్యంలో నువ్వెందుకున్నావు? నువ్వు చూడ బోతే నాగరికుడవు గానూ, సుకుమారం గానూ ఉన్నావు. ఈ పంది మాటంటావా? దాన్ని ముందు కొట్టినవాణ్ణి నేను. నేను కొట్టిన పందినే నువ్వు కొట్టావు. బలమున్నది గదా అన్న పొగరుతో నన్ను తప్పు పట్టుతు న్నావు. అంత బలవంతుడవైతే నాతో యుద్ధా నికి రా!" అంటూ అర్జునుణ్ణి రెచ్చగొట్టాడు.

అర్జునుడు అలిగి కిరాతుడి మీద వరసగా బాణాలు వేశాడు. కాని, కిరాతుడు వాటిని లక్ష్యపెట్టక, "ఇవేం బాణాలు? ఇంతకన్న మంచి బాణాలు లేవా? ఇంతకన్న బాగా యుద్ధం చెయ్యలేవా?" అన్నాడు.

అమోఘమైన తన అస్త్రాలను లక్ష్యపెట్టని ఈ కిరాతుడు మాయావేషంలో ఉన్న మహనీ యుడెవడో అయి ఉంటాడని అర్జునుడికి అనుమానం కలిగింది. మామూలు కిరాతు డైతే ఎప్పుడో పోయి ఉండేవాడు. ఏమయినా అర్జునుడు ఏ మాత్రం వెనకాడకుండా కిరాతుడి పైన బాణవర్షం కురిపించాడు. కొద్ది సేప ట్లోనే అక్షయతూణీరాలు ఖాళీ అయి పోయాయి!

అగ్నిదేవుడు ప్రసాదించిన అక్షయ తూణీరాలు ఖాళీ అయిపోవటం అర్జునుడి అనుమానాన్ని మరింత ఎక్కువ చేసింది. అయి నప్పటికీ అతను వెనకాడక తన గాండీవం మొనతో ఆ కిరాతుణ్ణి పొడిచి చంపబోయాడు. మరుక్షణం గాండీవం మాయమయి పోయింది! దాన్ని కూడా లక్ష్యపెట్టక అర్జునుడు కత్తిదూసి దానితో కిరాతుణ్ణి కొట్టాడు. కత్తి ముక్కలు ముక్కలై కింద పడింది.

అర్జునుడిప్పుడు నిరాయుధుడు. అతను కిరాతుడి పైన చెట్ల కొమ్మలు విసిరాడు. రాళ్ళు రువ్వాడు. అర్జునుడు ఏది ప్రయోగిం చినా కిరాతుడు మటుకు చలించ లేదు.

అప్పుడు అర్జునుడు కిరాతుడిపై కలియబడి, పిడికిళ్ళతో కొట్టసాగాడు. కిరాతుడు కూడా అర్జునుణ్ణి పిడికిళ్ళతో పొడిచాడు.

కిరాతుడి దెబ్బలకు అర్జునుడికి స్పృహ తప్పింది. అతను స్పృహ తెలిసి లేస్తూనే స్నానం చేసి మట్టితో చేసిన శివలింగం మీద పూలగుత్తి ఉంచి, కొంచెంసేపు ధ్యానించి లేచి కిరాతుడికేసి చూసేసరికి లింగం మీద తానుంచిన పూలగుత్తి కిరాతుడి నెత్తిన కనిపించింది.

ఇది చూడగానే అర్జునుడికి మొదట ఆశ్చర్యమూ, తరవాత సంతోషమూ కలిగాయి. తాను ఇంతసేపూ యుద్ధం చేసిన కిరాతుడు శివుడేనని గ్రహించి, అర్జునుడు సాష్టాంగపడి, స్తోత్రం చేశాడు.

అప్పుడు శివుడు అతని భక్తికి మెచ్చుకుని, "అర్జునా, నీ వంటి శూరుడు మూడులోకాల లోనూ మరొకడు లేడు. నీ భక్తికి మెచ్చాను. తేజస్సులో నువ్వు నా అంత వాడివి.నా దివ్యాస్త్రాన్ని నీ కిస్తాను. దాన్ని ప్రయోగించటానికైనా, స్వీకరించటానికైనా నువ్వు అర్హుడివి. దాని మహిమతో నువ్వు శత్రువులను జయిస్తావు," అనిచెప్పి అర్జునుడికి దర్శనమిచ్చాడు.

అర్జునుడు శివుడికాళ్ళపైన పడి తన అజ్ఞానాన్ని క్షమించ మని వేడుకున్నాడు. శివుడు అర్జునుణ్ణి కౌగలించుకుని, అతని చెయ్యి పట్టుకుని, "అర్జునా, పూర్వజన్మలో నువ్వు నరుడనే ఋషివి. అనేక వేల సంవత్సరాల పాటు నువ్వూ, నారాయణుడనే ఋషీ బదరికాశ్రమంలో తపస్సు చేశారు. మీరిద్దరూ అనేక మంది దుష్టరాక్షసులను చంపి, దేవేంద్రుడి పదవి నిలబెట్టారు. అప్పుడు నీ చేత ఉండిన ధనుస్సే ఇప్పుడు మళ్ళీ నీ వద్ద ఉన్నది. నా మాయచేతనే నీ గాండీవమూ, అక్షయ తూణీరాలూ మాయమయ్యాయి. నీ కోరిక లేమిటో చెప్పు, తీర్చుతాను," అన్నాడు.






"మహేశ్వరా, నాకు భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనులతో యుద్ధం కలగబోతున్నది. ఆ మహావీరులను జయించటానికి గాను నాకు పాశుపతాస్త్రమూ, బ్రహ్మశిరోనామాస్త్రమూ కావాలి. వాటిని నాకు అనుగ్రహించు," అని అర్జునుడు అన్నాడు.

శివుడు అర్జునుడికి పాశుపతాస్త్ర ప్రయోగమూ, ఉపసంహారమూ ఎలా చెయ్యాలో మంత్ర సహితంగా తెలిపాడు. గాండీవమూ, అక్షయ తూణీరాలూ అతనికి తిరిగి లభించాయి. శివుడు పార్వతితో సహా అదృశ్యమయ్యాడు.

అర్జునుడికి ఎక్కడలేని శక్తి వచ్చినట్ట యింది. తనకు అపూర్వమైన పాశుపతాస్త్రం లభించింది. ఈశ్వర దర్శనం లభించింది. ఈశ్వరుడి స్పర్శచే తన శరీరం పవిత్ర మయింది.

అంతలో, లోకపాలకులైన ఇంద్ర, యమ, వరుణ, కుబేరులు తమ భార్యలతో సహా, అర్జునుడు ఉన్నచోటికి వచ్చి, తమ అస్త్రాలు అతనికిచ్చారు. ఇంద్రుడు మాత్రం అర్జునుణ్ణి స్వర్గానికి ఆహ్వానించి, అక్కడ అతనికి దివ్యాస్త్రాలు ఇస్తానన్నాడు.

మరి కొంతసేపటికి అర్జునుడి కోసం ఇంద్రుడి రథం వచ్చింది. దానికి సారథి అయిన మాతలి, "అర్జునా, నీ కోసం ఇంద్రుడు ఈ రథం పంపాడు. ఆయన దేవతలతోనూ, గంధర్వులతోనూ, ఋషులతోనూ, అప్సరసల తోనూ కొలువుదీరి, నీ రాకకోసం ఎదురుచూస్తున్నాడు," అన్నాడు.

ఇంద్రుడి రథం ఎక్కే మాట అటుంచి, తాకటానికైనా తనకు అర్హత లేదేమోనని అర్జునుడికి అనిపించింది. అయినా, ఇంద్రుడి అనుజ్ఞ అయింది గనుక ఎక్కదలచి, ముందు మాతలిని ఎక్కమని, తరవాత తాను రథం ఎక్కాడు.

రథం ఆకాశంలోకి లేచి, సిద్ధమార్గాన పోసాగింది. దారిలో స్వయంప్రకాశం గల రాజర్షులూ, యుద్ధాలలో చనిపోయిన శూరులూ, సిద్ధులూ, గంధర్వులూ, అప్సరోగణాలూ కనిపిస్తే, వారు ఎవరెవరైనదీ మాతలి అతనికి వివరించి చెప్పాడు.

కొంత సేపటికి అర్జునుడికి అమరావతీ నగరం అంత దూరాన కానవచ్చింది. దాని వెలుపలి ద్వారం మీద ఎత్తయిన గోపురం ఉన్నది. అది చూస్తేనే అర్జునుడికి పరమానందమయింది. నగరం లోపల నందన వనంలో అప్సరలు విహరిస్తున్నారు.

అర్జునుడి రథం అమరావతీ నగరం ప్రవేశించగానే దేవతలు ఇంద్రుడి ఆజ్ఞపై అతనికి

ఎదురు వచ్చారు. గంధర్వులూ, సిద్ధులూ, అప్సరలూ అతనికి మంగళోపచారాలు చేశారు. నారదుడు మొదలుగా గల దేవర్షులు అర్జునుణ్ణి ఆశీర్వదించారు. అర్జునుడు మొగసాల వద్ద రథం దిగి, ప్రాకారాలుదాటి, దేవేంద్రుడి సుధర్మ అనే సభ ప్రవేశించాడు.

అక్కడ దేవేంద్రుడు నిండు కొలువులో ఉన్నాడు. ఆయన చుట్టూ గంధర్వులు స్తోత్ర పాఠాలు చేస్తున్నారు. వేద ఘోష వినిపిస్తున్నది; సిద్ధ, చారణ, మరుత్తులూ, విశ్వదేవతలూ, ఆశ్వినులూ, ఆదిత్యులూ, వసువులూ, రుద్రులూ, బ్రహ్మర్షులూ, రాజర్షులూ ఉన్నారు. ఇంద్రుడి పైన తెల్లని గొడుగున్నది. ఆయనకు వింజామరలు వీస్తున్నారు.




అర్జునుడు ఇంద్రుడి వద్దకు వెళ్ళి ప్రణామం చేశాడు. ఇంద్రుడు అతన్ని కౌగలించుకుంటూ లేవదీసి, తన సింహాసనం మీద తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు. ఆయన తన కొడుకైన అర్జునుడి కేసి చూస్తూ ఎంతో మురిసిపోయాడు. నారదుడు వీణ వాయించాడు, తుంబురుడు పాడాడు; అప్సరసలు నృత్యాలు చేశారు.

తరవాత దేవతలు ఇంద్రుడి ఆజ్ఞపైన అర్జునుడికి అర్ఘ్యపాద్యాలు ఇచ్చి, అందమైన విడిది గృహానికి అతన్ని తీసుకుపోయారు. అర్జునుడు స్వర్గంలో చాలా కాలం ఉండి, దేవతాస్త్రాల ప్రయోగ, ఉపసంహారాలు పూర్తిగా గ్రహించాడు.

ఆ సమయంలో ఇంద్రుడు అర్జునుడికి చిత్రసేనుడనే గంధర్వుడి చేత దేవతల సంగీతమూ, నృత్యమూ నేర్పించాడు. అర్జునుడికి స్వర్గంలో ఉన్నా, అరణ్యవాసం చేసే తనవాళ్ళూ, తనకు దూరమై పోయిన తల్లీ జ్ఞాపకం వచ్చి మనసు ఎంతో బాధ పడేది. అర్జునుడికి ఊర్వశి పైన మనసు కలిగిందని ఇంద్రుడు అపోహపడి, చిత్రసేనుణ్ణి పిలిచి, "అర్జునుడి కోరిక తీర్చమని ఊర్వశితో నా మాటగా చెప్పు," అన్నాడు. అలాగే చిత్రసేనుడు ఊర్వశితో చెప్పాడు. ఊర్వశికి అదివరకే అర్జునుడిపైన కోరిక కలిగి ఉన్నది. అందు చేత ఆమె ఇంద్రుడి ఆజ్ఞ పాలించటానికి ఒప్పుకుని, ఒక నిండువెన్నల రాత్రి అర్జునుడి విడిదికి వెళ్ళింది.

అద్భుతంగా సింగారించుకుని, సువాసనలు చిమ్ముతూ రాత్రివేళ తన విడిదికి వచ్చిన ఊర్వశిని చూసి అర్జునుడు అదిరిపడి, ఆమె పాదాలకు భక్తితో మొక్కి, "దేవీ, నీ రాకకు కారణమేమిటి? నా వల్ల ఏమి కావాలి?" అని అడిగాడు. ఊర్వశి తాను

వచ్చినపని చెప్పింది. అర్జునుడు హరిహరీ అని చెవులు మూసు కుని, "అమ్మా, నువ్వు నాకు కుంతీదేవి వంటి దానివి, శచీదేవి వంటి దానివి, మా మూల పురుషుడైన పురూరవుడికి భార్యవు. నేను నిన్ను తల్లిగానే భావిస్తున్నాను," అన్నాడు.

దానికి ఊర్వశి, "అర్జునా,ఈ దేవలోకంలో మా పద్ధతులు వేరు.మీ భూలోకంలో పద్ధతులు వేరు. అందుచేత లేనిపోని అనుమానాలు పెట్టుకోక నా కోరిక తీర్చు," అన్నది.

అర్జునుడు ఆమెతో, "అమ్మా, మీరు దేవతలు. మీరు ఏది చేసినా తప్పు లేదన్న మాట నిజమే.కాని నేను మానవమాత్రుణ్ణి. అందుచేత మీరు చేసేపనులు నేను చెయ్యలేను.నువ్వు నాకు తల్లిలాంటి దానివి. నామీద ఇతర భావాలు పెట్టుకోక, నన్ను నీ కొడుకులాగా చూసుకో!" అన్నాడు.

ఆశాభంగం కలగటంతో ఊర్వశికి ఆగ్రహం కలిగింది. ఆమె అర్జునుడితో, "ఓయీ, నేను స్త్రీని. స్వేచ్ఛ గలదాన్ని. నిన్ను వలచి వస్తే, నువ్వు నన్ను తృణీకరించావు. అందుచేత నిన్ను నపుంసకుడివి కమ్మని శపిస్తున్నాను. పేడివై, అంతఃపురంలో ఆడవాళ్ళ మధ్య ఆట పాటలతో కాలక్షేపం చేస్తూ ఉండిపోదువుగాక!" అని శపించి, గిరుక్కున తిరిగి, వెళ్ళిపోయింది. అర్జునుడు ఆ రాత్రి ఎలాగో గడిపి, మర్నాడు చిత్రసేనుడు రాగానే అతనితో, గడచిన రాత్రి ఊర్వశి తనవద్దకు రావటమూ, తానామె కోరికను తోసిపుచ్చటమూ, ఆమె తనను శపించి వెళ్ళిపోవటమూ వివరించి చెప్పాడు.

ఇదంతా చిత్రసేనుడి ద్వారా విని, ఇంద్రుడు అర్జునుడి వద్దకు వచ్చి, "అర్జునా, నువ్వు నిజంగా ఇంత నిగ్రహం కలవాడివని నేను అనుకోలేదు. ఇంత నిగ్రహం గల వారు మహర్షులలో కూడా చాలా అరుదుగా ఉంటారు. ఊర్వశి శాపానికి భయపడకు. మీరు ఒక ఏడాది పాటు అజ్ఞాతవాసం చెయ్యవలసి ఉన్నది గద. అప్పుడీ శాపాన్ని అనుభవించు.అందువల్ల నీకు మేలే అవుతుంది.ఆ ఏడాది కాగానే నీకు ఊర్వశిశాపం తీరిపోతుంది," అన్నాడు.

ఈ మాటలతో తృప్తి పడి అర్జునుడు చిత్రసేనుడి వెంట తిరుగుతూ స్వర్గంలో కాలం గడిపాడు.



# తిరుగులేనివైద్యం

హేలాపురిలో వుండే సుందరమ్మ మంచి స్థితిమంతురాలు. ఆమె ముగ్గురు కొడుకులకూపెళ్ళిళ్ళయికోడళ్ళు కాపరానికి రాకముందు, ఉన్న ఇద్దరు పనిమనుషులకూ, ఆ పనీ, ఈ పనీ పురమాయిస్తూ,ఊరికే కూర్చోక వంటపనుల్లో, పెరటి కూరపాదులకు నీళ్ళు పోయటంలాంటి పనుల్లో సాయపడుతూండేది. ఐతే, కోడళ్ళు కాపరానికి వచ్చాక పనిమనుషులను మానిపించి,అన్నిపనులూకోడళ్ళచేతచేయిస్తూ, వాలుకుర్చీలో పడుకుని ఏవో భక్తిగీతాలను కూనిరాగాల రూపంలో ఆలపిస్తూండేది.

ఇలా కొంతకాలం జరిగాక, ఆమె క్రమంగా స్థూలకాయురాలు కాసాగింది. తింటే ఆయాసం, తినక పోతే నీరసం అన్నస్థాయికి వచ్చాక, ఆమె వైద్యుల దగ్గరకు పోయి సంగతి చెబితే,వాళ్ళల్లో కొందరుతిండి తగ్గించమనీ, మరికొందరు ఇంటికి అరకోసు దూరంలో వున్న అమ్మవారి గుడికి ఉదయం,సాయంత్రం వెళ్ళి వస్తూండమనీ చెప్పి, ఏవో మందులిచ్చేవారు. భర్త కోదండపాణి అయితే– ఏకంగా ఇంటిపనుల్లో, పెరటిపనుల్లో కోడళ్ళకు సాయపడమన్నాడు.

సుందరమ్మకు అంత దూరాన వున్న అమ్మవారిగుడికి పోయే ఓపికలేదు. భర్త చెప్పినట్టు ఇంటి పనులు కోడళ్ళతోపాటు చేయడమంటే అత్త ఆధిక్యతను కించపరుచుకోవడమే కాక,వాళ్ళకు లోకువై పోతుంది!

ఈ పరిస్థితిలో ఆమెకు సుగంధపురిలో, ఒక వైద్యుడు మాత్రలతో స్థూలకాయాలు తగ్గిస్తున్నాడనితెలిసి, ఆయన దగ్గరకు పోయింది. ఆయన ఆమెకు వందమాత్రలున్న చిన్న సీసా యిచ్చి, వందరూపాయలు తీసుకున్నాడు.

"బాబుగారూ, ఈ మాత్రలు రోజుకెన్ని మింగాలి?" అని అడిగింది సుందరమ్మ.

"అవి మింగటానికి కాదు. వాటిని రోజుకు ఆరుసార్లు కింద పారబోసి, సీసాను ఎత్తయిన బల్లమీద పెట్టి, వందమాత్రలనూ ఒక్కొక్కటిగా ఏరి, సీసాలో వెయ్యాలి," అన్నాడు వైద్యుడు.

– కోనే నాగవెంకటఆంజనేయులు



# చంపకం

మనదేశంలో 'ఆలయవృక్షం'గా ప్రసిద్ధి గాంచిన చంపక వృక్షం మెక్సికో నుంచి ఇతర దేశాలకు వ్యాపించింది. హిందువులే కాకుండా, ముస్లింలు, బౌద్ధులు కూడా దీనిని పూజ నీయంగా భావిస్తారు. దేవా లయాలలో, మసీ దులలో ఇవి ఎక్కువగా కనిపిస్తాయి. ముస్లింలు దీనిని గోరీలవద్ద నాటి పెంచుతారు. అందు వల్ల దీనికి 'మృతుల పుష్పం' అనే పేరు కూడా వచ్చింది.

హిందీలో దీనిని చమేల్, గుల్- ఇ- చిన్ అనీ, మరాఠీలో ఖైర్ చంపా అనీ, గుజరాతీలో ధోలో చంపా అనీ, బెంగాలీలో దలమా పూలా అనీ, ఒరియాలో గోలోచీ అనీ, తమిళంలో ఇళత్తళరి అనీ, మలయాళంలో అరళి, వెళ్ళ చంపక అనీ అంటారు. తెలుగులో దీనిని అర్ఘత గన్నేరు అని కూడా అంటారు.

ఈ చెట్లు ఆరు మీటర్ల ఎత్తు వరకు పెరుగుతాయి. కొమ్మలు దృఢంగా నాలుగు వైపులకూ విరుచుకుని ఉంటాయి. ఆకులు లేనప్పుడు కొమ్మల కొనలు లావుగా కనిపిస్తాయి. దాదాపు 30.సెం.మీ. పొడవైన ఆకులు కొమ్మలచివర గుబురుగా ఉంటాయి. మధ్య కాడనుంచి ఆరంభమయ్యే ఈనెలు ఒకదాని కొకటి సమాంతరంగా ఉంటాయి. ఇతర చెట్లలాగే చంపకం శీతాకాలంలో ఆకులు రాలుస్తుంది.

పుష్ప దళాలు మొదట పసుపు, తెలుపు చివర ఎరుపు, లేతఎరుపు రంగులతో రక రకాలుగా కనిపిస్తాయి. పువ్వులు సువాసనలు వీస్తాయి. ఫిబ్రవరి నుంచి అక్టోబర్ వరకు పూస్తాయి.

వేళ్ళతో పెకలించినా చంపకం పూస్తూనే ఉంటుంది. అందుకే దీనికి 'జీవనవృక్షం' అనే మరొక పేరు కూడా ఉన్నది.



మనదేశపు ఋషులు:

# జాజిలి

సామాన్య మానవులకు చొరశక్యం గాని భీకరారణ్యం మధ్య జాజిలి అనే ఒక ముని తపస్సు చేస్తూండేవాడు. ఆయన వైరాగ్యంతో ఇంద్రియాలను జయించాడు.చెట్టు బెరడును చుట్టుకుని ఎండకూ,వానకూ,చలికీ తట్టుకుని ఘోర తపస్సు చేశాడు.ఆఖరికి అన్నపానాదులు కూడా త్యజించాడు. సూర్యరశ్మి నుంచి, గాలి నుంచి ఆయనకు కావలసిన జీవశక్తి లభించేది. ఆయన ధ్యానంలో కూర్చుంటే తుపాను సైతం కదిలించ లేకపోయేది!

ఒకనాడు జాజిలి ధ్యానం నుంచి లేచి నిలబడి ఉదయభానుడి కేసి చూడ సాగాడు. ఆ సమయంలో అటుకేసి ఎగురుతూ వచ్చిన రెండు పక్షులు ఏదో చెట్టు అనుకుని ఆయన తల మీద వాలాయి. పక్షులకు ఇబ్బంది కలిగించడం ఇష్టం లేక జాజిలి అలాగే నిలబడ్డాడు.కొంతసేపటికి ముడివేసిన ఆయనజటాజూటాలను గూడు అనుకుని ఒక పక్షి అందులో గుడ్లు పెట్టింది. గుడ్లు కింద పడిపోకుండా కదలకా మెదలకా ముని అలాగే నిలబడ్డాడు.

కొన్నాళ్ళకు గుడ్లు పిగిలి, పిల్లలు రెక్కలొచ్చి మెల్లగా ఎగరడం నేర్చుకున్నాయి. తల్లిపక్షి వాటికి ఆహారం తెచ్చిపెట్టేది. జాజిలి దీనినంతా అంతకాలమూ ఓర్పుగా భరించాడు. ఒకనాడు పక్షిపిల్లలు, తల్లిపక్షితో ఎటో ఎగిరిపోయాయి. సాయంకాలం తిరిగి వచ్చాక అవి బెదిరి పోకూడదని జాజిలి ఉన్నచోటు నుంచి కదల లేదు. మరునాటి ఉదయం వెళ్ళిన పక్షులు ఆరు రోజులకు కాని రాలేదు. అయితే, జాజిలి మాత్రం అక్కడే కదలకుండా నిలబడ్డాడు. ఏడవ రోజు ఉదయం వెళ్ళిన పక్షులు నెలరోజులు గడిచినా రాకపోవడంతో, అవి వేరొక నివాసస్థానం చూసుకున్నాయని గ్రహించిన జాజిలి సముద్రంలో స్నానం చేయడానికి వెళ్ళాడు. స్నానం చేస్తూ, "ఆహా! పక్షుల కోసం నేనెంత శ్రమపడ్డాను! నేనెంత తపశ్శాలిని!" అని మనసులో పొంగిపోయాడు. "నువ్వే అంత గొప్పవాడివయితే మరి వారణాశి వర్తకుడు తులాధరుడి మాటేమిటి?" అనే అశరీర వాక్కు వినిపించింది!

ఆ మాటలకు ఆశ్చర్యం చెందిన జాజిలి వారణాశికి వెళ్ళి తులాధరుణ్ణి కలుసుకున్నాడు. కుటుంబాన్ని పోషిస్తూ, చుట్టూ ఉన్న బంధు మిత్రులకు చేతనైన సాయం చేస్తూ, అహంకార మమకారాలు లేకుండా, అతి నిరాడంబరంగా, తృప్తిగా జీవనయాత్ర సాగిస్తూన్న తులాధరుణ్ణి చూడగానే జాజిలి మనస్సులో తాను గొప్ప తపస్విని అనే అహంకారం నశించింది. ఆయనతో చర్చలు జరిపాడు. వేదాంత రహస్యాలు తెలుసుకున్నాడు. జాజిలి కూడా వినయ శీలి అయ్యాడు!



# మీకు తెలుసా?

1. ముస్లింల పవిత్ర గ్రంథం ఏది?
2. 'బుల్ ఫైటింగ్' ఏ దేశాలలో ప్రసిద్ధమైన క్రీడ?
3. రోగి గుండె కొట్టుకునే వేగాన్ని వినడానికి డాక్టర్ ఉపయోగించే పరికరం పేరేమిటి?
4. జలచరాల ప్రదర్శనశాలను ఆంగ్లంలో ఏమంటారు?
5. మన దేశంలో ఓటు వేయడానికి ఎన్నేళ్ళు నిండి ఉండాలి?
6. గోళ్ళు కత్తిరిస్తే నొప్పి ఉండదు. ఎందువల్ల?
7. బంగారం ఎక్కువగా లభించే దేశం ఏది?
8. ప్రపంచంలో అత్యధిక జనాభా గల దేశం ఏది?
9. అద్దాన్ని ముఖ్యంగా ఏ పదార్థం నుంచి తయారుచేస్తారు?
10. భూమి ఉపరితలం, వాతావరణం, భూసారం, చెట్లు, మనుషులు మొదలైన వాటిని గురించి అధ్యయనం చేసే శాస్త్రం ఏది?
11. భూమి పైపొర కింద హఠాత్తుగా కలిగే కదలికలను ఏమంటారు?
12. చంద్రుడి మీద మొట్టమొదటిసారిగా పాదం మోపిన వారెవరు?
13. ఏ దేశపు ప్రజలను 'కివిస్' అని అంటారు?
14. పర్షియా ఈనాటి పేరేమిటి?
15. నత్త ఎంతకాలం నిద్రపోగలదు?

## సమాధానాలు

1. ఖురాను.
2. స్పెయిన్; మెక్సికో.
3. స్టెథస్కోప్.
4. అక్వేరియం.
5. 18 సంవత్సరాలు.
6. గోళ్ళలో నరాలు లేవు.
7. దక్షిణ ఆఫ్రికా.
8. చైనా.
9. ఇసుక.
10. భూగోళశాస్త్రం.
11. భూకంపాలు.
12. నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్, ఎడ్విన్ ఆల్డ్రిన్.
13. న్యూజీలాండ్.
14. ఇరాన్.
15. మూడు సంవత్సరాలు.

# బంగారు గడియలు నెం.5 : సమాధానాలు



4. బోలుగా ఉండడం. నిజానికి పక్షి ఈకల కన్నా ఎముకలు తేలికగా ఉంటాయి!

5. ఏడు ఎముకలే!



6. కింగ్‌కాంగ్.

7. నిప్పుకోడి (ఆస్ట్రిచ్): మామూలు ఆస్ట్రిచ్ గుడ్డు 1.6 కి.గ్రా. బరువు ఉంటుంది.

1. 'నెస్సీ', లాచ్‌నెస్ భీకరమృగం.

2. టిబెటన్లు దానిని 'యెతి' అన్నారు. పాశ్చాత్యులు 'అతిచెడ్డ మంచుమనిషి' అన్నారు.



8. ఈదకుండా ఉండలేవు. మిగతా చేపలకున్నట్టు వీటికి నీటిపై తేలడానికి ఉపయోగపడే క్లోమం లేదు. ఈదడం ఆపితే మునిగిపోతాయి. కాబట్టి నిదురపోయేప్పుడుకూడా ఈదుతూ ఉండాల్సిందే!

3. బెర్మ్యూడా ట్రయాంగల్. దీనిని డెవిల్స్ ట్రయాంగల్ అని కూడా అంటారు.

## అసలు పొరబాటు — అతిపెద్ద వేట

చరిత్ర పూర్వయుగపు మనిషి డైనోజార్‌ను వేటాడడంఅసంభవం.ఎందుకంటే మానవుడు పుట్టడానికి పూర్వమే డైనోజార్లు నశించి పోయాయి!





# దయ్యం చేసిన పెళ్ళి

గంగరాజుకు లక్ష్మి ఒక్కతే సంతానం. ఆమె తల్లి చిన్నతనానే పోవటంతో, తండ్రీ కూతుళ్ళిద్దరూ ఒకరికొకరు మిగిలారు. లక్ష్మి ఆనందంగానే బతుకుతున్నా, తన బొటా బొటి సంపాదనతో కూతురు పెళ్ళి ఎలాగా అని గంగరాజు మధనపడుతూండేవాడు.

ఇలా ఉండగా, ఒకనాటి ఉదయాన్నే పనికి బైలుదేరుతున్న గంగరాజును, ఇంటి యజమాని ఆపి, "ఇదిగో, ఈ నెల నుంచి మీ ఇంటి అద్దె మరొక పాతిక రూపాయలు పెంచుతున్నాను. ఇష్టం లేకపోతే మరొక ఇల్లు వెతుక్కో!" అన్నాడు నిక్కచ్చిగా.

ఆ మాట వింటూనే దిగాలు పడిపోతున్న తండ్రిని చూసి, గుమ్మంలోనే వున్న లక్ష్మి ముందుకు వచ్చి, "ఏ క్షణాన కూలి నెత్తిన పడుతుందో అన్నట్లున్న ఈ ఇంటికి, అద్దె పెంచి నిండా ఆరునెలలు కూడా కాలేదు. మళ్ళీ పెంచడమా?" అన్నది, కాస్త కోపంగా.

ఆ మాటకు ఇంటి యజమాని మండిపడి, "ఇంత చక్కటి ఇల్లు నీకు కూలిపోయే కొంపలా కనిపిస్తున్నదా? నీలాంటి సుకుమారికి, ఆ రత్తమ్మ దయ్యపుకొంపే సరైన చోటు! సాయంత్రంలోగా ఇల్లు ఖాళీ చేశారా సరేసరి, లేకపోతే తట్టా బుట్టా వీధిలోకి గిరాటెయ్యడం ఖాయం!" అంటూ రంకెలుపెట్టి, ఇంట్లోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు.

గంగరాజు నిస్సహాయంగా కూతురువైపు తిరిగి, "నాకిప్పటికే ఆలస్యమైంది. సాయంకాలానికి ఆయనకు కోపం కాస్త చల్లబడుతుందేమో చూస్తాను," అని వెళ్ళిపోయాడు.

లక్ష్మి ఇంట్లోకి వెళ్ళి, మంచం మీద విచారంగా కూర్చుని, ఇంటియజమాని అన్న రత్తమ్మ దయ్యపుకొంపగురించి ఆలోచించసాగింది. అక్కడికి రెండువీధుల అవతల వున్న పెద్ద మండువాలోగిలిఇల్లే రత్తమ్మది! బతికుండగా, రత్తమ్మ పేరు చెబితే చాలు

లక్ష్మీగాయత్రి

అంతా చెయ్యెత్తి దణ్ణం పెట్టేవారు. 'అమ్మా, ఇదీ కష్టం' అని చెప్పుకున్నవాణ్ణి, రత్తమ్మ ఎన్నడూ ఉత్త చేతులతో పంపి ఎరుగదు. అటువంటి రత్తమ్మ, మూడేళ్ళ క్రితం ఏదో చిన్న జబ్బు చేసి చనిపోయింది. ఆమె భర్త ఎప్పుడో పోయాడు. ఆ ఇంట మిగిలిందల్లా, రత్తమ్మ ఒక్కగానొక్క కొడుకు వేణు మాత్రమే.

రత్తమ్మ పోయిన కొత్తలో వేణుతో బాటు వంటమనిషీ, పనివాళ్ళూ వుండేవారు. అలా ఒక ఆరునెలలు గడిచేసరికి, పనివాళ్ళంతా రత్తమ్మ దయ్యమై ఆ ఇంట తిరుగుతున్నదని గోలచేసి,పనులు వదులుకుని వెళ్ళిపోయారు.

అదంతా గుర్తు చేసుకున్న లక్ష్మి, చివరకు ఒక నిర్ణయానికి వచ్చినదానిలా లేచి, "జాలీ దయా లేనివాళ్ళను మళ్ళీ మళ్ళీ అడిగి ఇంకా చులకన అయ్యేకంటే, మొండికెత్తి బతకటం వెయ్యిరెట్లు నయం,"అనుకుంటూ, ఇంటికి తాళం పెట్టి బయలుదేరింది.

లక్ష్మి, రత్తమ్మ ఇల్లు చేరేసరికి,ఒకయువకుడు అప్పుడే ఇంటికి తాళం వేస్తున్నాడు. అతడే వేణు అయివుంటాడని ఊహించి లక్ష్మి, అతడికి నమస్కరించి, తమ పరిస్థితి క్లుప్తంగా చెప్పి, "నాకు దయ్యాలున్నవన్న నమ్మకం అంతగా లేదు. కొద్దిరోజుల పాటు మమ్మల్ని మీ ఇంట తలదాచుకోనిస్తే, మీ మేలు మర్చిపోము," అన్నది.

ఆమె మాటలకు ముగ్ధుడైన వేణు, "అసలంటూ మీరీ ఇంట వుండాలే గాని, ఎన్నాళ్ళున్నా నాకు అభ్యంతరం లేదు. ఇది మీ స్వంత ఇల్లనుకోండి.మా అమ్మ దయ్యం కాలేదనీ, ఇది దయ్యపుకొంప కాదనీ, మీ వల్ల నలుగురికీ తెలిస్తే చాలు," అని, ఇంటితాళం తీసి, ఇల్లంతా ఆమెకుచూపించి, "కచేరీకి పోతున్నాను. మళ్ళీ సాయంత్రం వస్తాను," అని చెప్పి వెళ్ళిపోయాడు. వేణు వెళ్ళగానే, ఇల్లంతా మరొకసారి కలియదిరిగిన



లక్ష్మి, ముందుగా చీపురు తీసు కొచ్చి, ఇల్లంతా ఊడ్చి శుభ్రంచేసింది. తర్వాత ఇంటికి తాళం పెట్టి, తమకు పరిచయస్తుడైన రంగడనే బాడుగబండి వాడి సహాయంతో తమ సామా నంతా రత్తమ్మ ఇంటికి చేరవేసింది.

ఆ సరికి ఇంటికి తిరిగి వచ్చిన గంగరాజు, తనకూతురు చేసినపని తెలుసుకుని, రత్తమ్మ ఇంటికి వచ్చి తలుపు తట్టాడు.

తలుపు తీసిన లక్ష్మి, తండ్రి ముఖంలో కోపం గమనించి, "నిన్ను అడక్కుండా, ఇల్లు మార్చినందుకు కోపగించుకోకు నాన్నా! మన ఇంటి యజమాని అన్నదేమిటి? సాయంకాలా నికల్లా ఇల్లు ఖాళీ చేయకపోతే, బుట్టా తట్టా బయట పారేస్తానని! ఇంత అవమానం జరి గాక అక్కడ ఎలా వుండగలం? దయ్యాల గురించి ఏం భయపడకు. మన తాహతుకు తగినఇల్లు దొరగ్గానే వెళ్ళిపోదాం,"అని వేణు గురించి చెప్పింది.

ఆ రాత్రి వేణు ఆ తండ్రీ కూతుళ్ళతో పాటు భోజనం చేస్తూ, లక్ష్మివంటను చాలా మెచ్చుకున్నాడు. ఉదయం గంగరాజు పనికి బయలుదేరుతూ లక్ష్మితో, "ఈ రోజునుంచి ఇంటికోసం వెతుకుతాను.నేను వచ్చేసరికి పొద్దుపోయినా,ఖంగారుపడకు,"అని చెప్పాడు.

ఆ రోజు పగలంతా కూడా లక్ష్మి ఇంటినీ, ఇంటి చుట్టూ ఉన్న విశాలమైన ఆవరణనూ శుభ్రం చేస్తూ గడిపింది. చీకటిపడ్డాక పొయ్యి వెలిగించి, వంట ప్రారంభించింది.

వంట పూర్తికావస్తూండగా, "ఇంకా నిన్ను పలకరించకుండా ఉండడం నావల్ల కాదు," అన్న మాటలు వినిపించినై.

లక్ష్మి ఉలిక్కిపడి తిరిగి చూసేసరికి, పక్కనే పీట వాల్చుకుని నవ్వు మొహంతో కూర్చుంటున్న ఆడదయ్యం ఒకటి కని పించింది. ఆ దయ్యం రత్తమ్మేనని రూఢి చేసుకున్న లక్ష్మి కూడా నవ్వుతూ, "నాకు





తెలీకడుగుతాను. బతికుండగా అంత మంచి దానివి, చనిపోయాక దయ్యానివెలా అయ్యా వత్తా? ఇప్పుడు చూడు, ఇంత పెద్ద ఇంటికి నీ కొడుకు ఒక్కడూ ఒంటరిగా ఎలా మిగి లాడో!" అన్నది.

అందుకు దయ్యం పెద్దగా నిట్టూర్చి, "వేణుకు కాస్త వయసొచ్చినప్పటి నుంచీ, ఎంత తొందరగా వాడి పెళ్ళి చేసి కోడల్ని తెచ్చుకుందామా అని తహతహలాడాను. వాడు ఇదుగో, అదుగో అంటూ చేసిన ఆలస్యం అంతా ఇంతా కాదు. ఈ లోగా నేను కాస్తా హరీమని, వాడి పెళ్ళి చూడాలన్న ప్రగాఢ వాంఛ తీరక, దయ్యాన్నయి, మా పెరట్లో ఉన్న బావి పక్కన వున్న చింతచెట్టు మీద గుట్టుచప్పుడు కాకుండా కాలక్షేపం చెయ్యడం ప్రారంభించాను. రోజూ అర్ధరాత్రి వేళ ఒక్కసారి మాత్రం ఇంట్లోకి వెళ్ళి, నా కొడుకును కళ్ళారా చూసుకునేదాన్ని. పని వాళ్ళూ,వంటమనిషీ వాడికి వేళపట్టున అన్నీ అమర్చిపెడుతున్నారా లేదా అని గమనించే దాన్ని. క్రమంగా పనివాళ్ళ ప్రవర్తనలో మార్పు వచ్చింది.

ఒకనాడు నా కొడుకు పుట్టెడు జ్వరంలో మంచానపడి వుంటే, పనివాళ్ళందరూ కూడ బలుక్కుని, చీకటి పడ్డాక పెద్ద మూటెడు బియ్యంపెరటిదారిన అమ్మబోయారు.చూస్తూ వూరుకోలేక, వాళ్ళమీదికి ఒక్క దూకుదూకి, ఆ మూట లాక్కుని,"ఒరే, నేను రత్తమ్మను,మీ యజమానురాల్ని! అప్పట్లో మిమ్మల్ని కన్న బిడ్డల్లా చూసు కున్నాను. మీ విశ్వాసమేమై పోయింది? ఇలాంటి తప్పుడు పనులుచేశారో పీకలు నులిమేస్తాను!'అన్నాను. అంతే! అందరూ కలిసి, 'దయ్యం బాబో'అని కేకలు పెడుతూ వీధినపడ్డారు.ఇందులో,నా తప్పే మైనా ఉన్నదంటావా?" అని అడిగింది.

లక్ష్మి తలూపుతూ ఏదో చెప్పబోయేంతలో, వీధి తలుపు చప్పుడైంది. రత్తమ్మ దయ్యం రివ్వున కిటికీలోంచి ఎగిరి మాయమైంది.

ఆ తర్వాత, ఐదోనాటి రాత్రి, గంగరాజు ఆనందంగా ఇంటికి తిరిగి వచ్చి, కూతుర్ని కేకవేసి పిలిచి, "మనకు ఇల్లు దొరికింది. రేపు ఉదయాన్నే వెళదాం," అన్నాడు.

ఆ మాట వినగానే అక్కడే వున్న వేణు మొహం చిన్నబోయింది. అయినా దయ్యపు కొంపగానే పేరుబడ్డ తన ఇంట్లో, ఇంకా వుండమని వాళ్ళను బలవంతం చెయ్యలేక, తనలో తానే బాధపడుతూ మౌనంగా వూరు కున్నాడు.

గంగరాజు స్నానం చేసేందుకు పెరట్లోని బావి దగ్గరకు వెళ్ళి, బావి గట్టుమీద కాలు మోపగానే, పక్కనే వున్న చింతచెట్టు మీద నుంచి రత్తమ్మ దయ్యం దభీమంటూ అతడి ముందుకు దూకింది. గంగరాజు దయ్యాన్ని చూస్తూనే బిగుసుకుపోతూ, నోట మాట రాక, నిలుచున్న పాటున చతికిల బడ్డాడు.

దయ్యం కూడా అతనికెదురుగా చతికిలబడుతూ, "గంగన్నా! బతికుండగా నీకు చేసిన సాయం మర్చిపోయావా! నీకేం భయం లేదు, నే చెప్పేది కాస్త విను," అంటూ అర్థింపుగా, తను దయ్యమెలా అయినదీ, లక్ష్మికి చెప్పినదంతా అతడికి చెప్పి, "రేపు పొద్దున్నే మరొక ఇంటికి పోదామని, నువ్వు లక్ష్మికి చెప్పినమాట విన్నాను. ఈ నాలుగు రోజుల నుంచీ నా కొడుకు వేణు ఆనందంగా ఉన్నాడు. నీ కూతుర్ని వాడికిచ్చి పెళ్ళి చేసి, వాడి ఆనందాన్ని శాశ్వతం చెయ్యి. కోరికదీరా వాడి పెళ్ళి చూసి, ఈ ఇల్లొదిలి నా దారిన నేను పోతాను! నా మాట నమ్ము!" అన్నది.

స్వతహాగా జాలిగుండే, మంచితనమూగల గంగరాజు, దయ్యం మాటలకు కరిగిపోతూ, "నీనుంచి లోగడ ఉపకారం పొందిన వాణ్ణి, నీ మాట కాదంటానా, అక్కయ్యా?" అన్నాడు.

ఆ మాట వింటూనే దయ్యం ఆనందంగా, "హమ్మయ్య పెళ్ళిభోజనం చేసినంతతృప్తిగా ఉన్నది, గంగరాజూ!" అని, రివ్వున గాలిలోకి లేచి మాయమైంది.

వెంటనే స్నానం మాట కూడా మర్చిపోయి ఇంట్లోకి వచ్చిన గంగరాజు దిగులుగా కూర్చుని వున్న వేణును చూసి జాలిపడుతూ, "బాబూ, మేం వెళ్ళడం నీకు ఇష్టం లేనట్టున్నది. మా లక్ష్మి మీ ఇంట శాశ్వతంగా వుండి పోవడం, ఇష్టమైతే చెప్పు. దాన్ని నీ చేతుల్లో పెట్టి, నా దారిన నేను పోతాను," అన్నాడు గుంభనంగా నవ్వుతూ.

అది వింటూనే ఆనందంతో తబ్బిబ్బైన వేణు, గంగరాజు చేతులు పట్టుకుంటూ, "అంతకంటే అదృష్టమా, మామయ్యా! ఈ ఇల్లే లక్ష్మిదయ్యాక, నువ్వొక్కడివీ వేరే ఎక్కడికో వెళ్ళడం దేనికి? ముగ్గురం ఒకరి కొకరం తోడుగా బతుకుదాం," అన్నాడు.

అక్కడే వుండి, వాళ్ళిద్దరి మాటలూవిన్న లక్ష్మి సిగ్గుతో తల వంచుకుని పక్కగదిలోకి వెళ్ళిపోయింది.





# తల్లిప్రేమ

ఒక గ్రామంలో ఒక పేదరాలికి ముత్తు అనే కొడుకు ఉండేవాడు. తల్లికి వాడంటే గారాబం. తాను కష్టపడి పనిచేసి సంపాదించిన డబ్బుతో కొడుకును ఎంతో ఆప్యాయంగా పెంచింది. ముత్తుకు తినటమూ, తోటివాళ్ళతో ఆడుకోవటమూ తప్ప వేరే పని లేదు.

అయితే ముత్తు ఒక సంగతి గమనించాడు. తన ఈడుకుర్రాళ్ళందరూ తమకు చాతనైన పనులేవో చేసి, తల్లిదండ్రులకు సహాయంగా ఉంటున్నారు. తాను కూడా తల్లికి సహాయపడదామని ముత్తు అనుకున్నాడు, కాని తనకొడుకు శ్రమించటం తల్లికి ఇష్టం లేకపోయింది. ఉన్న ఊళ్ళో తానుపని చెయ్యటానికి తల్లి ఒప్పుకోదు. అందుచేతమరే ఊరైనా వెళ్ళి పనిచెయ్యాలన్న ఉబలాటం ముత్తుకు కలిగింది. అందుకు కూడా తల్లి ఒప్పుకోదని తెలిసి, ముత్తు ఒకనాడు తల్లికి చెప్పకుండా ఇంటి నుంచి బయలుదేరాడు.

వాడు చాలాదూరం ప్రయాణం చేసి ఒక గ్రామం చేరి, అక్కడ ఒక ధనికుడి ఇంట పనికి కుదిరాడు. ధనికుడి వద్ద ఒక సంవత్సరం పని చేశాక వాడికి తల్లి మీద గాలి మళ్ళింది. వాడు ఈ మాట యజమానితో చెబితే ఆయన వాడికి ఒక వెండి అచ్చు బహుమానంగా ఇచ్చి, దాన్ని జాగ్రత్తగా ఇంటికి చేర్చమన్నాడు. ముత్తు పని చేసిన కాలంలో ధనికుడి ఇంట రెండు పెళ్ళిళ్ళు జరిగాయి. అప్పుడు ధనికుడు తన నౌకర్లకందరికీ కట్నాలూ, కానుకలూ దండిగా ఇచ్చాడు. ముత్తు తాను పని చేసిన కాలంలో జీతండబ్బులు కూడా ఏమీ తీసుకోలేదు. అందుచేత ఇప్పుడు వాడికి ఇంత వెండి దొరికింది. దాన్ని వాడు తన పైబట్ట కొంగున కట్టుకుని భుజాన వేసుకుని, ఎంతో ఉత్సాహంగా తన గ్రామానికి బయలుదేరాడు. నడుస్తున్నకొద్దీ ముత్తుకు వెండిమూట భారం

పెరిగిపోతున్నట్టు అనిపించింది. ఆ బరువు మూలాన చురుకుగా నడవలేక పోయాడు.

ముత్తు కొంతదూరం వెళ్ళాక ఒక మనిషి గుర్రంమీద ఎక్కి ఎదురొచ్చాడు. దాన్ని చూడగానే ముత్తుకు, తనకు అటువంటి గుర్రం ఉంటే తాను వేగంగా తల్లిని చేరుకోవచ్చు గదా అనిపించింది. వాడు గుర్రంమీద వచ్చే వాణ్ణి పలకరించి, "ఏమండీ, ఇటువంటిగుర్రం ఖరీదు ఎంత ఉంటుంది?" అని అడిగాడు.

"నీ దగ్గిర ఏమున్నది గుర్రాన్ని కొనడానికి?" అని గుర్రంమనిషి అడిగాడు.

ముత్తు ఆ మనిషికి తన వెండి చూపాడు. ఆ మనిషి ఆ వెండి తీసుకుని గుర్రాన్ని ఇవ్వటానికి ఒప్పుకున్నాడు. ముత్తు తన వెండి కాస్తా ఆ మనిషికిచ్చి, అతని సహాయంతో గుర్రం మీద ఎక్కి కూర్చున్నాడు.



ముత్తు ఎక్కి కూర్చోగానే ఆ గుర్రం శరవేగంతో దౌడు ప్రారంభించింది. దాని వేగాన్ని అదుపు చెయ్యటం గాని, దాన్ని తన ఇష్టం వచ్చిన దిక్కుగా నడిపించటం గాని ముత్తుకు సాధ్యం కాలేదు.

గుర్రం అలా దౌడు తీసి పోతూంటే ఒక చోట ఆవులను మేపుతున్న వాడొకడు ముత్తు పరిస్థితి గమనించి, కర్ర ఎత్తి గుర్రానికి ఎదురు వచ్చి, దాన్ని ఆపటానికి ప్రయత్నించాడు. గుర్రం ఆగింది, కాని ఆగే ముందు హఠాత్తుగా వెనకకాళ్ళమీద లేచి ముత్తును కింద పడేసింది.

తరవాత ఆవులను మేపేవాడు ముత్తును లేవదీసి, "జానెడు లేవు. నీకీ గుర్రం స్వారీ ఏమిటి? అసలీ గుర్రం నీకెలా వచ్చింది? ఎక్కడైనా దొంగిలించలేదు కదా?" అని అడిగాడు.

ముత్తు తన సంగతంతా ఆ మనిషితో చెప్పుకున్నాడు. "నువ్వు చాలా పొరపాటు చేశావు. ఈ గుర్రాన్ని చూసి మీ అమ్మ ఏమని సంతోషిస్తుంది? అంతకన్నా, చెప్పిన మాట విని ఒక ఆవును తోలుకుపోయి నట్టయితే మీ అమ్మ చక్కగా పాడి చేసేది గద. ఇప్పుడైనా మించిపోయింది లేదు. నాకీ గుర్రాన్నిచ్చి, మంచి ఆవును తీసుకుని ఇంటికి వెళ్ళు. మీ అమ్మ నిన్ను మెచ్చుకుంటుంది," అన్నాడు ఆవులను మేపే మనిషి.

ఆవు దూడలను పెడుతుందనీ, ఇంటి నిండా ఆవులమంద తయారవుతుందనీ ఊహించుకుని ముత్తు గుర్రాన్నిచ్చి ఆవును తీసుకోవడానికి ఒప్పుకున్నాడు. కానీ ఆ ఆవులను మేపేవాడు వాడికి ఒక వట్టిపోయిన ముసలి ఆవునిచ్చి పంపేశాడు.

ముత్తు ఆవును తోలుకుంటూ బయలుదేరాడు. వాడికి మధ్యాన్నం అయినప్పటి నుంచీ ఆకలి దహించుకుపోతున్నది. సాయంకాలం దాకా ఆగితే ఆవు పాలిస్తుందనీ, అవి తాగి కడుపు నింపుకోవచ్చుననీ వాడు అనుకున్నాడు.

సూర్యాస్తమయం వేళకు ముత్తు ఒక మేకల మంద ఉండేచోటికి చేరాడు. వాడు మేకల కాపరిని అడిగి ఒక చెంబు తీసుకుని ఆవును పితకటానికి ప్రయత్నించాడు. పాలు రాకపోగా ఆవు తన్నసాగింది.

ఇదంతా చూస్తూన్న మేకలకాపరి నవ్వి, "ఇది ముసలి ఆవు. నీకేం పాలిస్తుంది? దీన్ని ఎక్కడ సంపాదించావు?" అని ముత్తు నడిగాడు.

ముత్తు వాడికి తన కథంతా చెప్పాడు.

"పాపం, నిన్ను చిన్నవాణ్ణి చేసి మోసం చేశారు. ఈ ఆవును ఇక్కడే వదిలేసి, ఒక మంచి పాడిమేక నిస్తాను, తీసుకుపో. కొద్ది కాలంలోనే నీకూ ఒక మేకలమంద ఏర్పడుతుంది," అన్నాడు మేకలకాపరి.

వాడు తానిస్తానన్న మేకను పితికి ముత్తుకు తాగడానికి దాని పాలు కూడా ఇచ్చాడు. ముత్తు తృప్తిపడి ఆ మేకను తోలుకుంటూ ఇంటిదారి పట్టాడు.

కొంతదూరం పోయాక మేక ముత్తు వెంట రాక, వెనక్కు పోవడానికి ప్రయత్నిస్తూ, "మే, మే," అని గట్టిగా అరవసాగింది. దానితో పెనుగులాడేటందుకు ముత్తుకు శక్తి చాలలేదు.

ఇంతలో ఒక మనిషి చంకలో కోడి పుంజును పెట్టుకుని అటుగా వచ్చి, "ఎందుకబ్బాయీ, ఆ మేకతో ఘర్షణ పడుతున్నావు? ఇది నీది కాదా? దీన్ని ఎక్కడికి తీసుకుపోతున్నావు?" అని అడిగాడు. ముత్తు ఆ మనిషికి తన కథంతా చెప్పేశాడు.



కోడిపుంజు మనిషి అంతా విని, "మీ ఊరు ఇంకా చాలా దూరం ఉంది. ఈ మేకను బలవంతాన అంతదూరం నువ్వు నడిపించలేవు. నా మాట విని దీన్ని నాకు వదిలేసి ఈ కోడిని తీసుకుని వెళ్ళు. ఇది నీకు రోజుకు పదేసి గుడ్లు పెడుతుంది. చూస్తూండగానే నీ ఇల్లంతా కోళ్ళమయం అవుతుంది.మీ అమ్మ చాలా సంతోషిస్తుంది," అన్నాడు.

ముత్తుకు ఈ సలహా నచ్చింది. ఆ మనిషి చేతిలో వున్నది కోడిపుంజనీ, అది గుడ్లు పెట్టదనీ కూడా ముత్తుకు తెలీదు. వాడు బాధ విరగడయిందే చాలనుకుని, మేకను ఆ మనిషికిచ్చి, కోడిపుంజును తీసుకుని బయలుదేరాడు.

వాడు కొంత దూరం పోయాక ఒక గ్రామంలో ఒకచోట ఒకమనిషి అనేక కత్తులు తన ముందు పోగేసుకుని, సానరాయి మీద ఒక్కొక్కటే సానపడుతున్నాడు. ముత్తు ఆగి, వాడు చేసేపని చూసి,"ఎందుకిట్లా చేస్తున్నావు?" అని అడిగాడు.

"కత్తులను పదును పెడుతున్నాను. ఈ కత్తులన్నీ పదును పెట్టానంటే రూపాయి డబ్బులు వస్తాయి. ఒక పూట పని," అన్నాడు సానవాడు.

"నాక్కూడా అటువంటి సానరాయి ఉంటే బాగుండునే," అన్నాడు ముత్తు.

"నా దగ్గిర ఇంకో రాయి ఉంది, కావలిస్తే అమ్ముతాను," అన్నాడు సానవాడు.

"కొనటానికి నా దగ్గర ఈ కోడి తప్ప ఏమీ లేదు," అన్నాడు ముత్తు.

"పోనీ అదే తే!" అంటూ సానవాడు కోడిపుంజును తీసుకుని ఒక సానరాయి ముత్తుకిచ్చాడు.

ముత్తు ఆ రాయితో తన గ్రామం చేరుకుని తల్లితో, తాను ధనికుడిచ్చిన బరువైన వెండి సుద్దను సానరాయి కింద ఎట్లా మార్చినదీ చెప్పాడు.

"పిచ్చి వెధవా! అంత వెండి పోగొట్టుకుని ఈ పనికిమాలిన రాయి తెచ్చావా? వెండిపోతే పోయిందిలే. నువ్వు తిరిగి వచ్చావు. అంతే చాలు," అన్నది తల్లి.

ఆ తరవాత ఆమె వాణ్ణి పనిలో ప్రవేశించనిచ్చింది. ముత్తు మంచి పనిమంతుడు కావడంవల్ల తల్లి కన్న ఎక్కువే సంపాదించి, తల్లిని సుఖపెట్టాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



MAHANTESH C. MORABAD



MAHANTESH C. MORABAD

✷ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ✷ అక్టోబర్ నెల**15**వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ✷ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ✷ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **ఒకరికొకరుగా తోడు!**

రెండవ ఫోటో : **ఒక్కటై నిలిచారు చూడు!**

పంపినవారు : ఎం. జ్ఞానప్రత్యూష
D/o. ఎం. పద్మావతి, రాపూరు,
ఇందుకూరుపేట (మండలం), నెల్లూరు జిల్లా - 524314 (ఆం.ప్ర)


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00
చందా పంపవలసిన చిరునామా :
**డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026**

Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India), Controlling Editor: NAGI REDDI.

CHANDAMAMA (Telugu) October 1996 Regd. No. M. 4854

PARLE

# మరవద్దు ఆ 'జీ' తత్వం ఎప్పుడూ మనం... జీవితాంతం

## జీవిత పరమార్థం ఇదేలే ఇదే

జీవితంలోని యీ దారుల్లో వేసే ప్రతి అడుగూ పరీక్షే నిజానికి. ఏ దారుల్ని అనుసరిస్తాం, వేటినుంచి విముఖులమౌతాం అనేదే మన వ్యక్తిత్వానికి గుర్తు. ఏదీ కోరకుండా, ఏమీ ఆశించకుండా, ఎవరికైనా తోడ్పడటం. నిజానికి నిజాయితీగా బతకడం అంటే యిదే. మరవద్దు ఆ 'జీ' తత్వం మనం... ఎప్పుడూ మనం, జీవిత పరమార్థం ఇదేలే ఇదే.
ఏళ్ళతరబడిగా భారతదేశంలో అన్నింటికన్న ఎక్కువగా కోరుకుంటూన్న బిస్కట్.




• రుచికరం, నిజంగా శక్తిమయం. •

everest/95/PPL/110tl